# భావార్ణవము.

గ్రంథకర్త:

శ్రీ నిజాము మహారాజమాన్య,

**రామకృష్ణామాత్య, దేశపాండ్యా.**

కుమార ప్రింటింగ్ వర్క్సు

వరంగల్.

ఫిబ్రవరి, 1944.

మూల్యము:-

ఒక రూపాయి.

# ఉపోద్ఘాతము.

ఈ భావార్ణవము రచించిన సుహృన్మణి....సోదరసారస్వతోపాసకుఁడగు శ్రీ నెల్లుట్ల రామకృష్ణామాత్యుని సాహితీ జీవనముతో మొదటినుండియు నాకుఁ బ్రమోద కుమారనామమునఁ బ్రత్యక్ష సంబంధము కలదు. కావుననే యాయన నన్నీ గ్రంథమున కుపోద్ఘాతము వ్రాయుమని కోరుటయు, దానికి నే నంగీకరించుటయు జరిగినది.

ఈ గ్రంథమున మా యమాత్యుఁ డానాఁటి వాదోపవాదములతో నేమాత్రమును సంబంధము లేనివారిని గూడ రచ్చకెక్కించినాడు. నిన్నగాక మొన్న మహాకవులగు శ్రీ విశ్వనాథ వారిచేఁ దన "సూరబాల" కభిప్రాయము వ్రాయించికొని తిరిగి శ్రీనాథుని ప్రసక్తిదెచ్చి వారిని

"మా యమాత్యులయెడ నభిప్రాయ మొసఁగ
నితని యధికారమెయ్యది ? యితఁడెవండు ?"

అని గ్రంథకర్తగారు తృణీకరించుట నాకత్యంతాశ్చర్యముఁ గలిగించినది. ఈయనకు శ్రీ విశ్వనాథ మున్నగువారి యందు వ్యక్తిగతముగ నెట్టి ద్వేషము లేకపోయినను పనిబూని మొత్తము వైదికజాతిని పలుచన జేయవలయునను తలంపే యిట్టి వ్రాతలకు గారణమని నేను వారి సంభాషణము వలన గ్రహింపఁ గలిగితిని. ఇది కొప్రపు కవుల యాత్మశాంతికి జేసిన పనియఁట. అందునకుఁ దన సర్వస్వము ధారపోయునఁట. ఎవరో యొక రేమోయనిరని యొక ప్రత్యేక శాఖపై నీవిధముగ దండెత్తుట యెంతవఱకు సమంజసమో కదా!

ఉద్రేకము, ఉద్వేగము, ఆవేశము మా కవిగారికి స్వభావ సిద్ధములు. కావుననే యీ గ్రంథమునం దాయన కలహావిధముగఁ జిందులు త్రొక్కినది. ఆ కవితావేశమును, జాతీయోక్తులచే విలసిల్లు నాశైలిని తిలకించినప్పుడీయన తన రచనము నందించుక నిగ్రహమును జూపించిన నెంతయు సరసముగా నుండునని నాకుఁ దోచుచున్నది.

ఇన్నింటికీ మూలకారణము గ్రంథకర్తగారు వ్రాసిన యుత్తరములకు వేంకటశాస్త్రిగారు ప్రత్యుత్తరమీయక నిర్లక్ష్యభావము వహించుట యని తెలియుచున్నది. కొన్ని సందర్భములయం దల్పకారణముల వలననే మహానర్థములు సంభవించును గదా! (Trivial occurances can alter the destinies of nations.) ఈ వైదిక, నియోగి విభేదముల మూలమున ప్రజ్వరిల్లిన విద్వేషాగ్నికిని గారణమిట్టిదే యనుట విస్పష్టము. వెనుక నెన్నఁడో గుంటూరియందుఁ దిరుపతి వేంకట కవుల శతావధానము జరిగినదఁట. ఆ సందర్భమే యీ శాఖా ద్వేషములకు బీజము నాటినది. ఆనాఁటి సభానిర్వాహకులలో నెవరో యొక మహానుభావుఁడు వేదికపైన తిరుపతి వేంకట కవులతోఁబాటు కొప్పరపుకవులకుఁ గూడ నాసనములు వేయించెనఁట. ఆ యాసనములే యీ కలహమును గల్పించినవి. ఒకరి శతావధాన సందర్భమున వేదికపై నింకొకరి కాసనముల నమర్చుట తత్సభానిర్వాహకుల తప్పు. అంతమాత్రమున తమ కేదో న్యూనత ఘటిల్లినదని తలంచి, యంతకుఁ బూర్వము పరస్పర గౌరవాభిమానములఁ గలిగియుండియు, నాఁటి నిండు సభలో, 'వీరు మాకెందునను సమానులు కా'రని వచించు

టయు, రెండు భాషలను [illegible] వివాదములు పెంచుటయుఁ దిరుపతి వేంకటకవుల తప్పా. చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరిసొమ్ము కాదుగదా! ఎన్నఁడో యంతరించిన యీ వాదమును తిరిగి నేఁడు త్రవ్వి తలకెత్తి వైదిక జాతినంతటిని తిట్టిపోయుట మా కవిగారి తప్పా.

భాషా ప్రపంచము పరమ పవిత్రము. అందు సాహితీ రంగము పూజామందిరము. మతసాంఘిక వైషమ్యములకందుఁ దావులేదు. ఆనందోపాసన యే భాషాసేవకుల పరమావధి. ఏవో లేనిపోని కారణములఁ బురస్కరించికొని, యుద్రేకవశమున యుక్తాయుక్తములు మఱచి యాత్మస్తుతి, పరనిందలతోఁ గాలముఁ గడుపుటవలన సాహిత్యమున కెట్టి లాభమును కలుగదు. సర్వవిధముల సంక్షుభితమై యున్న జాతి నుత్తేజిత మొనరించుట భాషాసేవకుల పరమధర్మము. ఇట్లు రోషములఁ బెంచికొని గ్రంథములపై గ్రంథములు ప్రకటించికొనినచో నిందెవరి కెవరును దీసిపోరు. ఇది యిరువదవ శతాబ్దము. భారతీయులు తినగూడును కట్టబట్టయును లేక బానిసలై యున్నారు. ఇంక నీవిభేదము లెందులకు?

విశ్వమానవ కల్యాణవేదిక నలంకరించి ప్రేమగీతముల నాలపించిన రవీంద్ర కవీంద్రుని దివ్యవాణి, మానవజాతి యేక కుటుంబమని యుద్ఘోషించినది. అట్టి కవితా వాయువులు భరతఖండమున- కాదు, విశాల సాహితీవిశ్వమున వీచుచున్నవి. భాషాసేవకులారా పవిత్ర వాతావరణమును గలుషిత మొనర్పుట పాడిగాదు.

ఐకమత్య మాంధ్రులెఱుంగని పరమరహస్యము. వైదికులు, నియోగులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, బ్రిటిషాంధ్రులు, నిజామురాష్ట్రాంధ్రులు, రాయలసీమవారు, మొదలగు విభేదములకు లెక్కయే లేదు. ఒక్క రాజకీయములందే గాక సారస్వత క్షేత్రముననూ మేముగొప్ప మేముగొప్ప యని పోరాడుచున్నారు. ఎవరు గొప్పయని తేలినను మనకందు లాభించున దేమి? మనకు కావలసినది జాతియొక్క సమిష్టి సౌభాగ్యము. అందునకుఁ గవులు, కళోపాసకు లొసంగు సందేశ మేమి? వారు తమకర్తవ్యము నే విధముగ నిర్వహించుచున్నారు?

స్వభానుసంక్రాంతి
ఏకశిలానగరము.

ఇట్లు,
దేవులపల్లి రామానుజరావు, బి. ఏ.

# నా మనస్తాపము.



ఈ నామిత్రుని యుపోద్ఘాతమునందలి ఇతరవిషయము లెట్లున్నను నందున నేనేమియు విమర్శింపను. దాని కేమి? శ్రీరంగనీతు లింతకుమించి యెవరైనను జెప్పఁ గలుగుదురు. అంతటి రాజర్షి యగు తిక్కనను, మహర్షి యగు పోతనను వదలి బెంగాలిలోని రవీంద్రుని గొని తెచ్చి యేమో చెప్పుట మాత్రము నా కెంతయు మనస్తాపము గలిగించినది. ఈసుంత విశాలదృష్టి వారికి లేదేమో! రవీంద్రుని కవితావాయువులు విశాల సాహితీవిశ్వమున వీచుట యతని యదృష్టము. తిక్కనపోతనల కింగ్లీషు రాకపోవుట వారి దురదృష్టము.

“ఆంధ్రాభిమానమువల్ల మన కవీశ్వరులను జగత్తులోని ఉత్తమ కవులతో పోలిస్తే రసికబృందంలో మనం హాస్యాస్పదుల మౌతాము.” అని నోరి నరసింహశాస్త్రిగారు. “ఇది భాషాజాత్యభిమానం లేనివారి మాటే కాకుండా సత్యదూరం. తిక్కన పోతనలుగల సాహిత్యం యెంతమాత్రం సిగ్గుపడ నక్కరలేదని మనవి చేస్తున్నాను” అని కుటుంబరావు గోవిదుఁడు. ఈ ప్రత్యుత్తరమున కితని నెంత ప్రశంసించినను దక్కువయే.

నా మిత్రునివలెనే “గెటే” యను నొక శార్మణ్యుఁడు కాళిదాస శాకుంతలములోని యొక శ్లోకమునకు గంతులు వేసినాఁడఁట. అతని భావదారిద్ర్యమునకు నాకు జాలివేయు చున్నది.

నెల్లుట్లః-

# సర్వాంధ్రి కవులకు.

"...... అనేకు లీకాలమందు గూడ నియోగులను ప్రభువులని పొగడుచు, ప్రారంభమున వారి యాస్థానకవులమని చెప్పికొని వారికి గృతులిచ్చి బ్రతుకుచు, బిమ్మటఁ దమకు మహాపదవి వచ్చినదనుకొను గర్వంబుతో నియోగిజాతినే తిట్టి నీచవృత్తికి దిగి పతితులగుచున్నారు. ఇది యెంత వైపరీత్యము? పూర్వమంత్రిలు తమ సోదరులగు కవుల కనేకవేల యగ్రిహారము లిప్పించుటకు గారకులు. (చూ. శ-క-చ. పుట 413, 414.)

ఆధునిక యుగమునందు- తిక్కనతీరులు, పోతనపోలికలు, శ్రీనాథునిఛాయలు, కొంచెము కొంచెమైనఁగల కవులు లేకపోలేదు. ఇప్పటికిని మంత్రికులమువారే వాఙ్మయ రంగమున నాయకులుగ నున్నారు. ......ఆంధ్రిదేశ వాఙ్మయ చరిత్రములయం దాంధ్రి నియోగి బ్రాహ్మణుల పలుకుబడి సామాన్యమైనది కాదు. ముప్పది యిద్దఱ మంత్రిల చరిత్రిమున్నది. అది మున్ముం టయిరువది మంత్రిల చరిత్రిముగ వృద్ధిచేయవచ్చును. ఇది సత్యోక్తికాని గర్వోక్తి కాదు...... ధీమంతులును, తెలుఁగు కవితకు పునాదులువేసిన వారునగు రాజమంత్రికులము వారియాత్మ స్వాతంత్ర్యము, నాత్మగౌరవమును రాగల వేయి సంవత్సరములలోఁ బుట్టు సర్వాంధ్రి కవులును నిలఁబెట్టి, యేకులమువారైనను తెలుఁగు కవి కులమును దానిగౌరవమును రక్షింపవలసి యున్నది."

వంగూరి సుబ్బారావు.

# ఇది నా నిర్వచనము.



శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు జి. జోసఫుకవిగారి "భారవి"కి పీఠిక వ్రాయుచు తాము దానిని జదివి జాషువకవి గారి "ఫిరదౌసి" జదివి నప్పటి కన్న నెక్కువ యానంద మనుభ వించినట్లు చెప్పినారు. అనఁగ జాషువ కవిగారి కన్న జోసఫు కవిగారే కవిత్వము బాగుగా వ్రాయుదురని. ఇది యొక యతి శయోక్తియే గాక వట్టి బూటకము. వారి భారవి గ్రంథ మంతయు జాషువగారి యొక పద్యము తోరాదు. ఇట్లు నా వచిం చుటకు శ్రీ జోసఫు కవిగారు కినియవలదు. తాము కవిత్వము శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని మించి వ్రాసెదరు. ఇంకను జెప్పవలయు నన్న నన్నుమించి. అంతియే కాని తమకు జాషువ కవిగారితో సామ్యము కుదురదు. వారితో సమాను లొక తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారే తప్ప నాధునికులలో మఱియొకరు లేరు. (శ్రీమాన్ సంపన్మకుంబ సింగరాచార్యులు గారిప్రసక్తి యిటలేదు. వారు పోతనామాత్యునితో వచ్చెదరు.) నేటి సాహిత్యాకాశమున వారిరువురే సూర్యచంద్రులు. వారికి వారే సాటి. ఇది భాషా సామ్రాజ్యమున కభిషిక్తుఁడైన యమాత్య వల్లభుని నిర్వచనము.

చెప్పవలయునుగదా! ఇందునకు విరుద్ధముగా శ్రీ కురుం గంటి సీతారామయ్య ఎం. ఏ. గారు తమ నవ్యాంధ్ర సాహిత్య వీధులయందు మఱి యిరువుర-విశ్వనాథ రాయప్రోలు వారలను చేర్చుకొనినారు. అది కేవలము స్వ మతాభిమాన మనియే నా వచించునది. కాదేని వారు తమ చెప్పినవారిని నా చెప్పినవారి తో పోటీ చేయింపవచ్చును. నేను వారల యోటమి నా యో టమిగా నొప్పికొనెదను. ఇంకనేమి?

ఇట్లనే నాచన సోముఁడు తిక్కనను మించి కవిత్వము వ్రాయునని వెనుక నొకప్పుడు నా వచించుట కమాత్యేతరులు కొందఱు కాదని విమర్శించినారు. అందలి సత్యాసత్యము లట్లుండె. ఆంధ్రభాష యందు నా మాట కాదనుటకు మొదట వారి యధికారమేమో తెలియగోరెదను.

నెల్లుట్ల —



ఎవఁడురా! మా యమాత్యుల నీసడించి

కలమునడిపెడి మొనగాఁడు తెలుఁగునేల ?

# TO THE NIYOGI WORLD.

The contention of Sri Tirupathy Venkata Kavulu that their moustache represents the fact that they alone are the supreme poets in Telugu and Sanskrit, and their Challenge to men of letters, are I feel from the innermost recesses of my heart' just causes for righteous indignation. He who does not feel like this, I believe, is not entitled to a place in literature, has no sense of self respect and is good for nothing among the three crores of Andhras.

It has been established beyond doubt that Telugu language and literature from the very beginning of its existence is deeply indebted to the Niyogi Brahmins. Indeed it is their creation. In the light of these remarks it will be obvious that the Challenge of Sri Tirupathy Venkata Kavulu is a challenge to the very self respect of the Niyogi Brahmins at large. On being confronted by Sri Kopparapu Kavulu who wanted to keep up the prestige of Niyogis, Sri Tirupathy Venkata Kavulu came out with their impertinent publication of Gunturi Seema.

# II

The conflict between these poets originated with a dispute regarding the Chairs placed over the dais for Kopparapu Kavulu on the occasion of a Sathavadhana of Tirupathy Venkata Kavulu. In this connection it must be noted that Kopparapu Kavulu never sought for a seat on the dias and the audience never raised any objection. The question was raised by Tirupathy Venkata Kavulu themselves. They even went to the extent of declaring that Kopparapu Kavulu can never equal them in any respect. Evidently at this juncture no person with any sense of self respect can keep quiet and Kopparapu Kavulu could not pocket the insult. No wonder their blood boiled.

Neverthless the Andhra literary world did not find fault with Tirupathy Venkata Kavulu who were entirely responsible for what all happened. On the other hand many a voice was raised against Kopparapu Kavulu on behalf of Thirupathy Venkata Kavulu. The indebtedness of the Andhra nation to Niyogi community needs no mention. If this is the state of affairs at present what guarantee is there that we will not be crushed down in the future Andhra Province? We should certainly feel grateful to the Almighty for having roused us from the long stupor as early as this. Prevention

is certainly better than cure. Ingratitude is the characteristic feature of Andhras. I believe in this respect we can prefer the Muslims to Andhras.

When every man, nay every animal, is striving for its betterment, why not we follow suit? There can be no duty higher than the duty to oneself. Thus in brief I have expressed myself. My cherished ideal is the welfare of the Niyogis. I snatch this opportunity of throwing out a proposal that a Niyogi conference should be convened as soon as possible in order to find out ways and means for their uplift. In this conference a resolution should be moved to the effect that we shall have nothing to do with the Mahabharatha of Nannaya and other non-Niyogi literature and let not others interfere with the writings of our poets. May we then reqnest our Andhra bretheren to point out a single piece of Art when we Niyogis bid good bye to Telugu? Why, why should we request? Look, no less a scholar than Mr. K. Sita Ramayya M. A. stands there asserting emphatically that Gunturi Seema is a valuable gift to Telugu poetry.

I would be failing in my duty if I conclude without expressing my deep delt of gratitude to our benevolent ruler, H. E. H. the Nizam. We the Deshmukhs and Deshpandyas of the Dominions

are prepared to give our lives at the command of our ruler for the territolial expansion of the Dominions. In achieving this purpose we will not even shirk to slay our kith and kin. That is our duty, that is our ambition. The example of our ancestors is before us. The be all and the end all of our lives is to serve the state and the ruler. Let us not, even dream of sedition, let us not discredit our forefathers.

**May God bless the Asafia dynasty with peace and prosperity.**

**N. R. K. Amatya.**

# అఖిల నియోగి వల్లభులకు.

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకట కవులు "రెండు భాషలకు మేమె కవీంద్రుల" మని మీసములం బెంచి "రోసము కల్గినం గవివరుల్ మము గెల్వుఁ" డనుట "లాంధ్ర కవికోటిని లక్షింప కుండుట" యని భూనభోంతరములు ప్రతిధ్వనింపఁ గంఠమెత్తు చున్నారు. తోడ్తోనందున కాంధ్రకవు లెల్లరు కన్నెత్తిజేయ వలసిన విధి యనియును. అట్లు చేయనివారంద అభిమాన హీనులు, వా దృష్టియందు వారు కవులు కారు. చెప్పుటకు నుండు మూఁడుకోట్ల యాంధ్రులలో వారు కొందఱు దౌర్భా గ్యులు. నాఁటికి నేఁటికి నీ యాంధ్రకవిత్వము నియోగి బ్రాహ్మ ణుల వలన నొప్పియుండుట జగద్విదితము. ఆ మీసముల పద్య మున తిరుపతి వేంకట కవులెల్ల నియోగివర్గమునకు మాన నష్టము గూర్చినారు. అందునకు భయపడలేక, మన జాతి గౌర వము గాపాడుకొనుటకు, తమ నెనుకొనిన గొప్ప కవుల పయివారెట్లు గుంటూరి సీమ గ్రంథములఁ బ్రకటించి మన కప్రతిష్ఠ గూర్చినది మీ రెఱిఁగియే యున్నారు. ఇంతకుఁ గొప్పకవుల తప్పేమి? ఈ కలహ మానసపు జక్కతో గదా! ప్రారంభమైనది? తిరుపతి వేంకట కవుల శతావధానము నాఁ డావేశకపయి "మా శాసనములు వలయు" నని వారు కోరిరా?

అట్లమర్చిన యాసనములఁ గూర్చి సభ్యులేమైనఁ బ్రశ్నించిరా! ఆ బాధ్యత వారిపయి నుండనందున తిరుపతి వేంకటకవులెందునకు గల్పించుకొనవలయును? కల్పించికొనిరేపో-అంతటి నిందు సభను "వీరు మా కెందునను సమానులు కా" రను మాట యేమి? అందున కప్పుడెంతటి లేనివాఁడయినను హుంకరించి తీరుననిన నిఁక నంతటి మంత్రికులమున ప్రభవమంది, దేశంబున నప్పటికే యాశుకవీంద్రసింహములుగ విఖ్యాతి గాంచిన కొప్పరపు కవుల కాగ్రహము గలుగుట లోక యబ్బురమా? వారింత మానాభిమానములు లేనివారా? ఇట్లు మన్నింపరాని తప్పంతయును తిరుపతి వేంకట కవులదై యుండనందున కితరాంధ్రులు తమ కేమియు సక్కఱ లేదన్నట్లూరకొనిరే కాని వారికి దగిన బుద్ధి చెప్పరు. అంతేకాదు, ఇఁక వారిపక్ష మవలంబించి మొదట్లో కొప్పరపు కవులనే తూలనాడినారు. దీననాంధ్రులుకూడ నియోగుల నవమానపరచినారు. తాఁబుట్టిన నాఁటినుండియు నీ యాంధ్రభాష మన యాధిపత్యమున వర్ధిల్లుచున్నది. అట్టి భాషనుండియే వీరు నేఁడు మన నిట్లు గెంటివేయుచో నిఁక భావ్యాంధ్రరాష్ట్రమున మనకేది తావు? అందు మన యాలుబిడ్డలతో నెట్టి జీవనము గడుపుదుము? ఇట్లాంధ్రులు మున్ముందుగనే మనల మేల్కొలిపి నందులకు మనము భగవంతునకు ధన్యవాదము లర్పింపవలెను. ఇఁకను వారితోఁ

గాక యుండితిమేని మనకధోగతి తప్పదు. దీప మున్నప్పుడే యిల్లు చక్కఁబెట్టుకొనవలెను. ఆంధ్రులు వట్టి కృతఘ్నులు. వారిమీఁద నాకు నమ్మకము లేదు. ఇంక మహమ్మదీయులే చాలమేలు. సృష్టియందు చీమ మొదలుకొని ప్రతిప్రాణియు స్వోదర పోషణార్థము పాటుపడుచున్నది. అట్టితఱి మనమేల మన యభివృద్ధిని విచారించుకొనరాదు? తమ్ముమాలిన ధర్మ మాత్మవినాశనమునకే హేతువు. ఇవినాకుఁదోఁచిన యభిప్రాయములు. మొత్తము మీఁద నేను నా జాతి క్షేమమును గాంక్షించుచున్నాను. అందునకు దేశంబునంగల నియోగి జాత్యభిమానులందఱొక మహాసభగ నేర్పడి కర్తవ్యము నిర్ణయింప వలయునని నా మనవి. ఆలస్యము కూడదు. ఆ సభయందే, యమాత్యేతర సాహిత్యము, నన్నయగారి పేరనుండు రెండున్నర పర్వంబుల సహా తన్నివేయఁబడుచు, మన సనాదరించెడి యాంధ్రమహాజను లెందఱు కలరో వారందఱా నియోగుల గ్రంథంబుల ముట్టుకొనరాదనెడి తీర్మానమొండు ప్రవేశపెట్టఁబడు. మఱియు నియోగి యధ్యక్షత వహింపని సాహిత్య సభకు దేనికిని మనము పోరాదు. మనము పోయిన వెనుక నీ యాంధ్రుల కేమి కలదో చూచెదముగాక! ఏమిలేదెందులకు? కుఱుగంటి వారన్నట్లు “గుంటూరు సీమ” యొకటే భావకమూర్ధ్యాలంకారమై యుండ వారికేమి?

ఇఁక శ్రీ నిజాముఁరాష్ట్ర నియోగులలోని "దేశపాండ్య," "దేశముఖ్" మొదలగు బిరుదులు గల మేమందఱు మారాజు తోడివారము. తద్రాజ్య రక్షణార్థము మేము మా ప్రాణముల ధారబోసెదము. దేని యాజ్ఞయైనచో సంక నా రాజ్యమును విస్తీర్ణము జేసెదము. అందున కడ్డువచ్చిన మా కన్నసంతాన మును గత్తికెఱ గావించెదము. అది మాకు విహితకృత్యము. మామేన ప్రాణము లున్నంతవఱకా ప్రభుత్వము మేలు మఱువఁజాలము. మేము మా పూర్వులు పోయిన త్రోవఁ బోయెదము. మేము రాజద్రోహులము కాము. మా జాతి కపకీర్తిఁ దేము, ఆసఫియా సంస్థాన మాచంద్రతారార్కము వర్ధిల్ల వలయునని మా యాశయము.

ఇట్లు,

నెల్లుట్ల:-

# కత్తి కోఁత.



ఎవ్వరును లేరె యిందు! నన్నవరు పిలుతు
రింత దగ్గఱయన్న దిగ్భ్రాంతి వలవ
దేను గనరాకపోయిన నేమిగాని
నన్నెఱుంగు మమాత్యా! పోతన్నయందు?. 1

మీసముల పద్యమున కీవు రోసమందఁ
జేసికొనెనంట సంధిని జెళ్ళపిళ్ళ
అది యమాత్యుల కవ్వయింపదను మాట
నీవునాతని క్షమియించి నావటంట. 2

అట్లు నిలఁబెట్టి నీచదు వడుగునెడల
నోనమాలును వ్రాయంగ నోపకుందు
వట్టి నినుఁజూచివార లిట్లాడిరెట్లు!
లేదె! యీకొంచెమేనియు వైదికులకు! 3

ఇంతకారయఁ జెళ్ళపిళ్ళ యిట్లహౌని
నింకనా మీసములపద్య మేలచెప్పఁ?
జెప్పనే యనుమెట్లనో గొప్పకొఱకు
తీసితినటంచు నిక్కనైనఁ దెలుపఁజేల? 4

అట్లుగాఁజేయు విన్నప మవధరించి
నీవు నాతని దయను మన్నింతుగాక!
ఇంత కాపద్యమేదియ నంతవఱకుఁ
దెలియలేదేర? నేను శాంతింపలేను. 5

ఎందునకుఁ గోపమింత నీకందువేని
పట్టిచూడుము నాభాగవతము మఱల
నేనుగూడను శపథంబు బూనితంట
సంస్కృతాంధ్రంబు లనెడి భాషలకురెంటఁ. 6

ఇందు వారలు మేమే కవీంద్రులమన
నింక నెవ్వరు లేగనియే కదోరి!
ఇప్పుడీ కాలమందుననే యటన్న
నేఁడు నేనేమి లేకున్న వాఁడనాదె? 7

ఉన్నచో నేల గన్పడకుందు వనినఁ?
దలఁచ నేనిది మల్లయుద్ధం బటంచు
నొసఁగరా! దీనికేమి ప్రత్యుత్తరమ్ము?
తగుదునని వచ్చినావె వాదంబొనర్ప. 8

ఇంక నాపెద్దతనము నదేమొ చెప్పి
వైదిక నియోగిభేదంబు వలదటందు
దీని నేనిప్డు క్రొత్తగ దెచ్చినాన?
ఎంతటి యమాయకుఁడవు! నిన్నేమనందు? 9

చెప్పు మేఁజూతు గుంటూరి సీమలరసి
నేఁడు వాబోంట్లకిందు రాఁగూడదనుచు
నవుర! యిద్దఱి కొఱ్ఱపంపు కవులమీఁద
నెత్తి యిన్నాళ్ళుగురుగూడి వత్తురేమి? 10
అట్లవచ్చెడి నరిసమూహంబు గొనక
పోరుగావించు నన్నదమ్ముల నయారె!
చంపుదురె? సాటిమాత్రిలు శల్యులగుచు!
ననుభవింతురె? వారు కర్ణునియవస్థ! 11
కంటివేనీవు!- కొఱ్ఱపంపు కవులచితులు
కాలుచున్నవి నేఁటి కాకాశమంటి
కట్టియ యొకండుగూడను గానరాదు
అది యెఱుంగుమురా! హృదయాగ్ని యందు). 12
ఇంత తలపోసి చేయునదేమిలేక
నేఁటికెందఱో యట్లు కన్నీరుగార్తు
రంతమాత్రింబు జూపవు సానుభూతిఁ
జెప్పనేటికి? నీమాట సిగ్గుచేటు! 13
వారు నినుఁజూచుటకు దమయూరుబిలచి
యాదరించుట నాతోడ ననుదెయింక?
నరరె! నీఁయువివేక మేమనఁగవచ్చుఁ?
దలఁప నదియేకదోరి! యింతఱుఁగతంబు. 14

ఏమిలాభంబు? వైరి దండెత్తినప్పు
డెదుటివానికి దగుఁగాక యెదిరికొనుట
వానినొక కొంతపొగడి యిప్పగిదిననుపఁ
జెల్లఁబో! చెళ్ళపిళ్ళకే చెల్లెఁబొమ్మ! 15

అంతకే వాఁడుగూడ హీనాత్ముఁ డగుచు
శిష్యుఁడై పోయె నంట యాచెళ్లపిళ్ల
కెంతయపకీర్తి? పోతన యేడజచ్చెఁ
బగులఁదన్నిన నేమొకో వానిశిరము! 16

చెప్పికొనుదింత కాడాడ గొప్పతోడ
"వాఁడమాత్యుఁడు చూడ మావాడె" యనుచు
నేను నాతలనింక నెట్లెత్తికొందు?
నీవు నీతండ్రికేల జన్మించినావు? 17

అంతనీచెప్ప వృద్ధాప్యమందుఁ గూడ
ననరె? వినువారు సభ నెదుర్కొను మటంచు
వారలనుగన్న తల్లియే వీరమాత!
చూడ నీతల్లియంతటి క్షుద్రయేమి? 18

మాతృగర్భమందు మగచూలుగా నీవు
దోఁపనేల పలయుఁ? దోఁచినట్టి
పిండమెడలియైన బండలు కాదేల?
ఇంకనైనఁజావ కేల బ్రతుక? 19



# స్వగతము.



“బాలుఁడె కాని వీఁడరయ భండనమందున వైరికోటి గ
గ్గోలొనరించి నన్నుఁగనుఁ గోఁగలఁడం” చని నమ్మియుండి యే
త్రోలితినట్లు కానియెడ దోసమువాయది గాఁగనన్ను నె
క్కాలము దిట్టిపోయదె జగంబకటా! యపుడేమి సెప్పుదుర్?

చెప్పున దేమటంచనియెసీ! భయదార్తుఁడ నాచు నేటికీ
చొప్పుఁదలంప? మంత్రిగ వసుంధరఁ బుట్టినవాఁడు బాలుఁడై
యొప్పు నెగాక! పద్ధ తన మూనిపరించుటకన్న వైరులం
బిప్పియొనర్చి తానునని నిల్గుదునన్నిఁక నెవ్వఁడేమనుర్?

ఇంతవచించు దేని సహియింపఁ డొకింతయు నట్టివాని నే
నెంతయు నొవ్వనాడియని కేఁగఁగ జేతుఁ గుమారుఁడొక్కఁడే
నంతలఁ జెందునో యెఱుఁగ వైరుల నేరులు; నామనంబు ని
శ్చింతఁ దలిర్పవానినిలు జేర్పగ దేవతలార! మ్రొక్కెదన్.

ఇట్లు,
పోతన.

# రెడ్డిలోకమునకు.

బ్రాహ్మణులయందు నెట్టి వైరములులేక
నందఱొక్కటిగానుండ నభిలషింతు
వైదిక నియోగి భేదమేర్పడిన మీఁద
రెడ్డిలోకంబునకు వివరించువార్త. 1

ఆంధ్రభాష నియోగి దటన్నమాట
శ్రోత్రగానిప్పుడేను వాక్రువ్వఁగాను
నిక్కమరయుండు నన్నయనొక్కని విడి
వానివే చెప్పఁదగిన కావ్యంబులన్ని. 2

నన్నపాచార్యు నంతగ నెన్నుటకును
న్యాయము వచింప కతము నారాయణుండు
ఇట్లువచ్చు నటంచు మాకేమి తెలియు?
నెత్తికొన్నాము నన్నయ నెత్తిమీఁద. 3

అంతకేమాదు వైదికు లధికులగుచు
నూదివై వంగనౌనె నియోగికవుల?
నింక నీయిల మేమె కవీంద్రులమని
మీసములదువ్వఁ జెల్లునే రోసమెత్తి? 4

అందునకు బోతనామాత్యు నాజ్ఞ మీఁద
వచ్చుచున్నాఁడు 'నెల్లుట్ల' వాఁడుచూడు
డితని నామంబు శ్రీరామకృష్ణుడంట
పోతనకుఁగూర్మి శిష్యుడై పొలచునంట. 5

వ్రాసెఁబోతన నాకుత్తరంబు నొకటి:-
సభలు సన్మానములటంచు జరుగునపుడు
"తీసిపోఁగూడ దితఁడు వైదికుల కెందు
నీవు నీరెడ్లకిది యెఱింగింపు" మనుచు. 6

ఇట్లు పోతన వ్రాఁకు లిఖించెననఁగఁ
గ్రమ్ముచున్నవి నీళ్లు నాకనులనిండ
నింత యభిమానుఁడే తనకితఁడటన్న!
ఎఱిఁగికొంటిని నేనిప్పు డితఁడనంగ! 7

అమ్మహాకవి యంత యాత్మాభిమాని
యిప్పు డర్థించినాఁడె నన్నితనికొఱకు?
ఎవ్వఁడేకాని! యింక నేనేలచూడ?
హృదయమును జీల్చి పూజలర్పించువాఁడ! 8

వింటిరే రెడ్లు! పోతన వినుచు మాట!
తీసి పోఁగూడదంట వైదికుల కితఁడు
సభలు సన్మానములటంచు జరుగునపుడు
మఱలఁ జెప్పెద దీనిని మఱువవలదు. 9

ఇట్లుగాఁ బోతనయె యెలుఁగెత్తునేని
పోవరే యాంధ్రులెల్ల రమ్మ్రుదుగనొకట?
తనకుఁ దెలియదు కాఁబోలు దానసంగ?
నింతకువచింప నతనికే నెంతవాఁడ? 10

ఎందుకో యేమొ! పోతన యింత తెలిసి
"నీవు నీరెడ్లకిది యెఱింగింపు" మనియె
నెట్లు తేల్తురో యాస్నేహ మింక రెడ్లు?
నన్నుఁ "గవిసార్వభౌమ శ్రీనాథుఁ" డండ్రు. 11

నాకుఁ గనకాభిషేక మ్మొనర్చుమాట
రెడ్లకిప్పుడు నిలువు పరీక్షవచ్చె
నంత్య దశ నేను బొందిన నారటముల
కందెదనుగాక! యీనాటి కాత్మశాంతి. 12

ఇట్లు,

శ్రీ నా థుఁ డు.

# రాజలోకమునకు.



ఎదురైనచో నాదు ♦ మదకరీంద్రము డిగ్గి
కేలూత యొసఁగి ♦ యెక్కించుకొందు
మనుచరిత్రం బందు ♦ కొనువేళ పురమేఁగ
బల్లకి నా కేలఁ ♦ బట్టికొందు
బిరుదైన కవి గండ ♦ పెండేరమున కీవ
తగుదని నేనపా ♦ దమున నిడుదుఁ
గోకట గ్రామాద్య ♦ నేకాగ్రహారంబు
లడిగిన సీమల ♦ యందునిత్తు

నంతటి మహోన్నతుఁడు మనయాప్త మంత్రి
పేదవడిపోవునట నేఁడు వైదికులకు!
సమ్మతమె? యిద్దిమీకు రాజన్యులార!
కొల్పనే హేమరాసులు కలిగిమనకు? 1

అడుగునెడవీఁడు మనకిడు దనునెకాని
ప్రాణములె పోని యాచింపరాదు మనల
వినుఁడు మీరీతఁడా "చెళ్ళపిళ్ళ" కాదు
మనకె యభిమానమును నేర్పు మంత్రిబిడ్డ. 2

ంబు పాడుజేసె
నేను దనతండ్రిఁ జంపించినాఁడటంచుఁ
దనను బెట్టిన చెఱనుండి దాటిపోయి
ముగురి రాజులలో నేస్తమును గుదిర్చె. 3

ఏమి కానున్నదో యెల్లి యేనెఱుంగ
నాంధ్రదేశంబు వీని నిరాదరించి
విశ్వమున నేరికున్నది వీనిప్రజ్ఞ?
కట్టియివ్వఁడె నైజాము పార్థివునకు? 4

ఏమిచెప్పంగ! రాజన్యు లింత తెలిసి
వీని నెంతేనియును గౌరవింపనొప్పు
హాయి వర్ధిల్లుమనదు రాజ్యంబులపుడ
క్షోణిపతులార! ఆంధ్రభోజుఁడను నేను. 5

శ్రీకృష్ణ దేవరాయలు.

# శరణు.



హే! మహామంత్రి! మావంకనింత చూడు
మియ్యెడే నీకు జోహారు లిడుదుమయ్య!
దోషముండిన సైఁపు మాంధ్రులము మేము
మాకు నీతోడిదే కాదె లోకమెపుడు? 1

రాజకీయంబు లందు నీరాక మాని
తెచ్చితివి దీనదశకు నీదేశమొకట!
తెలుపు నీకోప మంతటఁ దీఱలేదె?
పంతమున భాషకును మమ్ము బాపనేమి? 2

చెప్పవచ్చిన విషయంబు చిత్తగింపు
మెవరో తిరుపతివేంకట కవులటంచు
తోలుచున్నారు సకలసాధువుల వెదకి
తొల్లి శిశుపాలదంతవక్త్రులను బోలె. 3

అంతగా నొప్పియుండు నీయాంధ్రకవుల
వారి బాధలుపడక నెవ్వఁడు లేడు
కంటె! యవ్వారి జగదేక కవులటంచు
కనులఁ గానరుగద! మంత్రికవులఁ గూడ. 4

అందు దేవునిపుణ్యమా యనఁగ నొకఁడు
కాలచక్రము పైకొనఁ గూలెనపుడొ
అరయుమో మంత్రి! పాపీచిరాయు వనఁగ
బ్రతుకు చున్నాఁడు రెండవవాఁడు నేఁడు. 5

శిష్యులున్నారు వాని కీక్షితిని జాల
వారలును వానిఁ బోలినవారె; సచివ!
యెవ్వఁడేనియు వాని నిదేమటన్న
వచ్చి పడెదరు వారలు వానితోడ. 6

అందునంజేసి యెందఱో యవని నేఁటి
కతని కెందునఁ గాకుండ నట్లపోయి
రందునం జేసియే యొక్కఁడవని నింక
వానిగర్వంబు వంపఁగఁ బూనుకొనఁడు. 7

నీవు పోతనకోర్కెఁ జన్మించి తనుచు
వినుచు నుందుము వీనుల విందుగాఁగ
వలయునే చెప్ప నీమహత్త్వంబు నింక
బ్రహ్మరుద్రాదు లెంతటి వారనంగ! 8

తీసికొనుమయ్య! నీకిదే తెచ్చినాము
కలముకత్తుల రెంటిని గాన్కఁగాఁగ
నీటుముంచినఁ బాలముంచినను నీవ!
ఈవెతప్ప నితఃపర మెఱుఁగమేము. 9

# అభయము.



ఆలకించితి మీమొఱ నాంధ్రులార!
ఇందున గుఱించి యింతకే వెందుఁజాల
నిపుడు మీమాట నింకను నెఱిఁగికొంటి
తెండొక కలంబు మాత్రము దీసికొండు. 1

మూఁడుకోట్లకు నేఁడు మీముఖ్యు రాంధ్రు
లొసఁగు కత్తిని నేనంద నొల్లనవ్వా
డంతగా మించివచ్చు నటందు రేనిఁ
దెచ్చెదను నాదు చేతికత్తిని యికేమి? 2

మీనముల పద్య మొక్కండు దీసివేయు
నింతకే నేను వానిని హెచ్చరింతు
వ్యవధి యొనిమిది రోజుల వఱకటంచు
మఱియు నిది పోతనార్యుని మాటయనుచు. 3

నిర్గమించెడి నేఁటికి నెలలెనిమిది
తెలపికొనఁ డిప్పటికి దానిఁ దీతుననుచు
మీఁదు మిక్కిలి పోతన స్మృతివాఁడు
పట్టెకుడిపింతు పొందు తత్పాప ఫలము! 4

[ తేది 5—4—1943.]

# అంకితము.

అలనాఁ డుక్కివుఁ డైన యక్బరున కట్లామానసింహాది హిం
దుల చొప్పేర్పడఁ జెళ్ళపిళ్ళకిల మంత్రుల్ పెక్కురొక్కంట పిం
గలికాటూరులఁ బోలె దాసులగుచుం బ్రాణాలనం బొల్చి త
త్తుల సౌశీల్యమునిల్పు కొంప్రపుకవీంద్రుల్ మత్కృతిగ్రాహకుల్.

శ్రీమన్నెల్లుట్ల, ఆళ్వారుమంత్రి దేశపాండ్య, మఱియు వసంతుని యభినందనములతో.

గ్రంథకర్త.

---

ఈ యాళ్వారు మంత్రి, యమాత్యులవారి కన్నకొడుకు. ఐదేఁడుల వాఁడు. ఇప్పుడే, "అ ఆ, ఇ ఈ" లు నేర్చికొనుచున్నాఁడు. తన కోన మాఱన్ని వచ్చిన వెనుక కవిత్వము వ్రాసెదనను. వసంతుఁ డమాత్యుల వారి శిష్యుఁడు. ఇతని నామాటనే తప్ప లోకము మఱియెఱుంగదు. నీవును గవిత్వము వ్రాయరాదా? అని యమాత్యులవారు తన్నుఁ బ్రశ్నించునప్పు డెల్ల నితఁడు వారు నీశిష్యుఁడనన్న మన్ననయే చాలుననుచుండును. అమాత్యులవారీ గ్రంథ మచ్చొత్తించుటఁ దెలిసి వీరిరువురు దమ నామములందుఁ బ్రకటింప వలయునని కోరుచు దానిని వారీవిధముగ నెరవేర్చినారు.

దైవము మేలుచేసి శ్రీ విశ్వనాథ వారి నేకవీర కొడ్డిన పందెమున నిలఁబడఁ జేయుచో నా గ్రంథము "వసురాణి" పేరఁ బ్రకటించి, ఆంధ్రి భారతి మాయింటి యాఁడుబిడ్డ, అను మాటను సార్థకము చేయవలయునని మహామాత్యులవారి సంకల్పము. ఈ భావార్ణవ గ్రంథ మిదివఱ కెపుడో యచ్చుగావలసి యుండెడిది. మహామంత్రులవారి శరీరారోగ్యము బాగులేని కతమున నింత యాలస్యమయినది.

శివలెంక దుర్గాప్రసాదరావు.

# పీఠిక.

కలముకత్తుల రెంటి నొక్కటిగనడిపి
చాల విఖ్యాతినెసఁగిన సచివుఁ డితఁడు
పోవఁబోవ మహోద్వేగ పూరితంబు
పారమే లేని వీని భావార్ణవంబు. 1

ఇతఁడు నోచిన నోములవేమొ కాని
యాంధ్రభారతి వీనికే యాఁడుబిడ్డ
అందరెందఱు నామె నిల్లాలుగాఁగఁ
"బుట్టినింటికె కడుగూర్చు పొలతియెపుడు." 2

గొందఱామెను పెండ్లమటందు రయిన
నట్లు కాదామె యింతకే వ్యక్తి కేసి
ఆమె వీనికి "వసురాణి" యనఁగఁ బుట్టి
చచ్చిపోయిన దట్టి దోషమునె బట్టి. 3

ఊరహాస్యంబు నితఁడు మున్నెఱుఁగ కుండఁ
జాల ముచ్చటగా నామె జాష్వకిచ్చెఁ
జెప్పికొనలేదు విషయంబుఁ జిన్నపిల్ల
యిప్పుడే మేడ్చి చేయునదేమి కలదు. 4

అందవలె వీఁడు సంతోష మట్టి యామె
తనకు బిడ్డగ జన్మించుటనె తలంచి
అందవలె వాఁడు మోదంబునట్టి యామె
తనకు నిల్లాలటన్న మాటనె తలంచి. 5

ఇంతకు నమాత్యులే యొందఱిల జనించి
యెంత ప్రఖ్యాతి నార్జించి యేఁగలేదు?
బాపురే! వీని కింతటి భాగ్యమేమొ
కంటె! యీ నాకె యందున గన్నగుట్టు. 6

కొండఱేయిల నూరక దుందుఁజేసి
వీనిమించితి మనుకొంద్రు గాని హీ!హీ!హీ!
ఉండవలదేమి యందున కొక్క గ్రంథ
మేదిలేకుండ వారల నెవఁడు మెచ్చు? 7

అంతకు వచింప నీతఁడు వంతగ్గించి
యూరక నె యాడఁ డేటికి దారినడువ
నవుడు మాబోంట్ల కట్లుండ నవునెగాక!
యెదురులాడంగ ధర్మమే యితని కెపుడు? 8

కవితలో వీని మించిన కవిగలండె?
మంత్రమున వీని నిరసించు మంత్రియున్నె?
దానమున వీని నవ్వేడి దాతకలఁడె!
మానమున వీనిఁ గాదను మానియున్నె? 9

అంతవాఁడయ్యు గర్వమొక్కింత యెఱుఁగ
డెల్లవారలఁ దనఁబోలెనే తలంచు
నేమి సెప్పుదు నీతని నెంచి నేను?
సద్గుణంబుల ఖనిగాదె సచివుఁ డనిన? 10

వలయుచో నింక వీని సావాస ముండి
గొప్పవారాట నెంతేని నొప్పుగాక!
రమ్మటందురె! సభయందుఁ బ్రజ్ఞయున్న
విస్మరించునె! విశ్వంబు వీని ప్రజ్ఞ? 11

ఇపుడు వీనిని రమ్మందు రెవరు సభకు?
సభకు రాకనె సర్వంబుఁ జక్కఁజేసె
నింక సభయందె కాలిడ నేమి కలదు?
తత్క్షణంబునఁ దమయాంధ్ర త్రాళ్లు దెగవె! 12

చాలు సభలిఁకఁ దొల్లింటి సభయె కదర!
ఈ మహా ప్రళయంబున కేడ్చినద్ది?
కంప ముదయించుఁ గొప్రంపు కవులఁ దలఁపఁ
గాటికిని బోని, పోవదా కరణవుఁ బగ? 13

జగతి మాశిష్యు లిప్పుడు చాల నుందు
రితని వంచింతురని యేమొ యెంత్రుగాక!
వాఁడు ధర్మంబునకుఁ గట్టువడునె కాని
యెందునకుఁగాని గర్వోక్తులెంచి యేమి? 14

అపుడు రాకుందు రెవరు సాహాయ్య మితని
కెవనిఁగా నెంతురు వీనిని? హీనులార!
ఆంధ్రజనలోకమునకె 'నా' యనెడి వాఁడు!
గొడ్డుపోయినదే తెల్గు గడ్డ సీతి? 15

వేసితిని ముక్కలే నిట్లు వేయిమాఱు
లట్లు యుండెడి వీని భావార్ణవమున
పట్టుమని వచ్చి నా చెంపఁ బగులఁగొట్టి
యెందు నింతయుఁ జిక్కఁడే నేమిసేతు? 16

ఇంక నెవ్వార లోకవేయి నేల చెప్ప
రితనికే జాతి భేద మొకింత లేదు
చాలదే! యిందు జాషువ సాక్ష్య మొకటి
యెందునకుఁగాని వారి కింకేమి దిక్కు? 17

ఇంతటి యుదాత్తుఁ డురక నన్నీ నడింప
నెంతగా ఖేదమందెనో యేమొ తెలియ
వాని మీసల పద్యంబు పాడుగాను
దాఁ జెడిన కోతి వనము నంతటిని జెఱిచె. 18

నన్ను మించిన వారి నెందఱినో కనియు
"శబ్ద శాసన!" యని నన్నె చాలఁ బిలిచె
నెంత యభిమానుఁడనో యేమొ యితని కేను!
పీఠికను వ్రాయునంత కొప్పెదనె గాక? 19

నన్నయ.

———

# సభాప్రవేశము.

ప్రజ్ఞయున్నడ సభయందు వచ్చినన్ను
నెదిరికొనుమని నిక్కునో వృద్ధవీర!
కలముకత్తుల రెండు చేతులను రెంటిఁ
గొనుచు మఱివచ్చితిని కనుఁగొనుము వీని. 1

ఇవ్వియెంగలకంచు నూహించువారి
కెఱుఁగఁ జెప్పెదఁ గ్రొత్తదిందేమి లేదు
కలము కత్తుల రెంటి నేకముగనడుప
జగతిఁ బేర్వడిరంట నా జాతివారు. 2

అట్టివీరుల నొక్కఁడ నయినకతన
వీని నెప్పుడు దాల్పనా విధియయంట
అందుఁ బగతురు నను సభయందుఁబిలువ
వేఱచెప్పఁగ నేటికి వీనిమాట? 3

పిదప నీసభయందలి పిన్నఁబెద్ద
నడుగుచున్నాఁడ ముందు మాఱాడుఁడిందు
దోసమేగాక మఱియు దుందుడుకెగాక
వైదికునకెట్లు మీసంబు భావ్యమయ్యె? 4

సంతసంబునకైన మీాసములె యేమి?
అట్లయిం కేమి పెంచిన నడుగునెవఁడు?
లేదు నాకందు జోక్యంబు లేశమేనిఁ
దెలుపుఁ డామాటనే పోదు తలనువంచి. 5

ఇప్పుడా మీాసములఁగూడ నేమిలేక
నెన్నఁడో తీసివేయుట నెఱుఁగుదైనఁ
జాలఁజెప్పెడి మీాతిమీాసములె పోవ
నందునకె యున్న పద్యాని కంత యేమి? 6

ఏమి? యొకరెండు భాషల కేమొయనుట
కాయెనా భావ్యమైన నియ్యవని నేడ
నింతటి కవీంద్రులింక లేరేవచింప?
పీరలోకశేన నేటికి విశ్వకవులు? 7

ఏమి?యభినవతిక్కనా! యేమిచెప్ప
వేరి? కవిరాజులనెడి వారెందు జనిరి?
లేరె? యుభయప్రవీణు లెవ్వారలిపుడు?
బిరుదులందఱివింకను పేరుకేన? 8

దీననింకను వాకు సందేహమేల?
ఏవో బిరుదులు కోరివహింతురుగాక!
అందునకు మీారునిజముగ నర్హులెట్లు?
వారలగుటకు మఱిపుట్టవలెనుగాక! 9

ఏమి కవిరాజ! యీమీసలేడ్చుకవుల
నెప్పుడో వట్టి కుకవులం చేర్పరింతె?
అనయు మనుసువె? "చెరలాట" మనెడిగ్రంధ
మీవొకండవు నన్ను మన్నింపు మనఘ! 10

ఇతరు "లా మీసముల పద్యమెన్న మాకు
నన్వయింప" దటంచు మాటాడ రొక్కొ!
అయిన నామోము నేయద్ద యరయు నేమి!
వారి గర్వంబు నే వంప వత్తుగాక! 11

"నీకు నివియేటికి" కంచుం బ్రశ్నింతురేని
యీ తెలుంగు కవిత్వంబు నెంతదిద్ది
యెవ్వరెంతటి ప్రఖ్యాతి నెసంగలేదు?
వారి ముందట వీరెంతవారు? చెపుడ! 12

అందు ముఖ్యముగా "మంత్రి" లనెడి వార
లిందునకుం బెద్దవారుకదే నచింప?
వారిపేరులు భువి వినవచ్చు మేర
కిట్లు చెప్పంగనొప్పె? తారేమిగాక! 13

ఆంధ్రభాషకు మీ కెంత కంతెకాన
నూరకుందురు మీ రి"దేదో" యటంచు
మిమ్ముంబలెనె నట్లనేనెట్లు మిన్నకుందు?
నుందు నీభాష మాయమాత్యులది గాంగ! 14

"అద్దివారలఁ గూర్చితే"దనిన మొదల
నింక నేవచ్చు వెధవల కేడ్చెనందు!
రట్లఁజూచిన వీరి నేమనఁగ వలెను?
విశ్వకవు లెట్లొ? వినుచరే విబుధులార! 15

వీరు తమ మీసమొగ దన్ను వీరులున్న
"వచ్చి పైకొనుఁ"డనికదా! వదరి ఇంత
కింక మాభోంట్ల కది యన్వయింపదనిన
నేడ్వరే! యంత గర్వోక్తు లేల పేల్రిలఁ? 16

ఆంధ్రమున నందఱకుఁ దా నియ్యధికుఁడైన
మొదట మంత్రులఁ గనికదా ముందుబోవు?
నరరే! సిగ్గేల లేదమాయకులఁ జూచి
మీసముల దువ్వటలనున్న మేటితనము? 17

అయినఁగావలె నిజమున నాఁడుదయిన
నట్లుకాదేని మగవాఁడయైన వలయు
నందు నిందున గాకున్న నధమకవుల
కేటి కామీసములు వాని కేటిపాటి? 18

"ఎవరయా? మీరలీ మీసలే" మటంచు
నెవరొ యడిగిరెపో! యందు నేవొ చెప్పి
యట్లుపోవఁగ మచ్చయేమైనఁ గలద?
యిట్లు మొఱుగుట నేవచ్చె నేమిఘనత? 19

ఆతఁడింతకు వైష్ణవుం డయిన నేమి?
అందఱకు నింక నేమంట నగయరొక్కొ?
ఏనుగలుగంగ నెవ్వాని నెవఁడుగెలుచు?
నాంధ్రులకె నేను మానంబు నౌదుఁగాదె? 20

అట్లుగానొప్పి నేనిట్టు లనవినుండ
నాంధ్రుఁడగువాని నెవఁడేటి కపహసింప?
నతని నేమన్న నన్ననినట్లు కాదె?
కలదె? భేదంబు నాకు నాంధ్రులకొకింత? 21

అప్పటికి నేను పోతన యాజ్ఞమీఁద
నట్టిమీసల పద్యంబు గట్టినపుడు
తెలిపికొనరేల? "దాసిని దీతు" మనుచు
నింకఁబోతన కది యన్వయింప దెట్లు? 22

తనదు మీసంబు లా వైష్ణవునకె గాక
వినుతురఁట వీరు కొపరింపు వీరులకును
పోతనామాత్యుఁడే గడ్డిపోచ గాఁగ
నింక నేమంతురిలఁ గూర్చి యేమిచెప్ప? 23

ఇప్పటికి "నద్దిమంతులిలం దెవనికొకని
కన్వయింప" దటంచు మీరనుఁడు సభ్య
లేను మీమాట నాపని మానుకొనిన
నవని మఱియున్న ననుమించు స్వార్థపరుఁడు? 24

ఏమి పోసిమ్మటంచని యేఁగుకొలది
గడ్డి పోచలఁగూడను గర్వమెక్క
మానమీప్రొద్దు బూనుట మాఁచిలేదు
ఇంక నాధర్మమును నిర్వహింతు నేను. 25

ఆడరానట్టి దుర్భాష లాడినారు
నామనంబున బల్లెము నాటివారు
నేఁడు సూర్యుఁడు ననుఁ దేఱి జూడఁజాల
డాగలేనింక నన్నెవ్వ రాపలేరు. 26

ఎంత యాఁపుదమన్న నొకింత యేని
యాఁగకున్నది నాహృదయంబు నేఁడు
బ్రహ్మరుద్రాదులేవచ్చి యడుగనిమ్ము
ఎదిరికొని యింక రూపుమాపెదను గాక! 27

ఎవరి మొగమోటమున నెవ్వరేమనుందు
ధారపోసెద బ్రాణముల్ ధర్మమునకు
నేటిలోకంబు గ్రక్కనీ! నిప్పులోకట!
కలదు నాపేరు; భావిలోకంబు కలదు! 28

కనలేదా? నన్నయా ♦ ర్యుని మించివిరచించు
కవిబ్రహ్మయైన తి ♦ క్కన్నరచన!
మతిలేదా? యమ్మహా ♦ మంత్రియే యనిపించు
శంభుదాసుని నెఱ ♦ జాణతనము!

వినలేదో? యీమెల్ల ♦ విశ్వంబు పాలించు
పోతన గోపికా ♦ గీతములను!
గుఱుతు లేదో? త్రోవ ♦ గుడ్డ గుండెలఁజీల్చు
కవిసార్వభౌముని ♦ కలము పదును!
రావో వారికి సంస్కృతాంధ్రంబు లింత?
వీరె యందఱ తలదన్నినారె నేఁడు?
వారల కవిత్వమందున వీరిదెంత?
యింక మీసలపద్యాని కేమటంత? 29

అందుఁబోతన యీరెంటి యందుఁగూడ
నందఱను నేను మెప్పింతు ననియెనంట
కానరాదేమి వీరల కనులకద్ది?
తెల్పునకు రాదె! యూరక తినినతిండి? 30

“ఎంచిన మాదు వికాసముల
వెంతటి వంచ”ని యేడ్వ కింక వీ
రంచితులైన వారిఁగని
“యందఱినిం దనియింప మమ్ము ని
ర్మించిన బ్రహ్మకైనఁ దర
మే?” యని పోతన నీసడింతు రీ
కొంచెపు వారి నాల్కలను
గోసిన నేముకో! చెప్పరే? కవుల్! 31

"సభకు రానెవలదు సభవారిదోషంబు
ఎఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగియుండి కూడ నిట్టట్టులాడినఁ
బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము." 32

అన్నయట్ల నాతఁడెన్నఁగ నెందఱు
మెప్పుబడసి యిప్పుడొప్పుచుండు?
వీరలొకరు నేఁడు విశ్వకపీసులై
వాని వెక్కిరించు వారలేమి? 33

ఎందునింతకుఁగాక ♦ నేన్గుపై నెక్కుచు
నేనె యెక్కితినంచు ♦ నేడ్చినాఁడొ?
జాతికే లేని మీ ♦ సాలుఁ బెద్దగఁ బెంచి
వెధవ వేషంబుల ♦ వేసినాఁడొ?
లేని గాంభీర్యంబుఁ ♦ బూని యెల్లప్పుడు
వీరు వారేమని ♦ ప్రేలినాఁడొ?
దేశమంతటఁ బోయి ♦ తిరిపెమెత్తుచు వచ్చి
సన్మానములు నాఁగఁ ♦ జాటినాఁడొ?
వేని నెక్కక, వేషాలు వేయకుండ,
తిట్టులాడక, నెవని వేధింపకుండ,
నున్నయట్లుండి, యున్నదే యుండ జెప్పు
పోతరాజేంద్రుఁ డెటు చెడిపోయెఁ? జెపుడ! 34

ఎవరికుండవు మీసంబు లింతకరయు
నెవరికిని లేకయున్న నాకేని లేవె?
ఏను జెప్పితే? యిందువా కెవ్వఁడెదురు?
గర్వమింతగ వీరింక గ్రక్క నేమి? 35
మీరు వీరల గర్వంబు మెత్తురేని
మిమ్ము ముందటి లోకంబె మెచ్చుఁగాక
మీకు నవ్వారలను మీఱ రాకయున్న
లేర? యందున కింక నవ్వార లేని? 36
ఎవరు భయపడి తలవంప నేమికాని
"వీరలను మించువా రేరు లేర!" యనుచు
నిన్నిమాఱులు నే నెలుగెత్తి యడుగ
నొక్కటిగ లేవవలదె? నియోగి జాతి. 37
అంతటను మీకు వచ్చు భయంబదేమి?
ఒక్కడనె యైన నిలచి నే నుండ నొక్కొ?
ఇంత ననుఁజూచి కొనియెపో యేవుతోడ
నేము కలమన్న యొకమాట నేటికనరు? 38
ఎందునకుఁగాని వీర లిట్లిగసి పోయి
యకట! యిమ్మెయినాడనే యొకఁడుగూడ
జాలకున్నాడె? మీసలఁ జక్కఁజేయ
మంటఁగలిసెనె! యీనాఁడు మంత్రికులము? 39

అట్లు పేరునకును నేరి కరయరాక
మాసిపోవరదేల? నా మంత్రివార
లవనిఁగలిగియు నభిమాన మమ్మికొనిన
నెట్లు తలయెత్తవచ్చు? నా కింత చెపుడ! 40

మంత్రి పదవులపై దృష్టి మఱల దేని
బుద్ధి బలముల కేటికీ ముండ మునుఁగు?
ఖడ్గములఁబట్టి శౌర్యంబు గ్రక్కకున్న
కలము లవికూడఁ బోయెనే గంగఁగలసి? 41

జగతి నీవాఁడు సోదర జాతులన్ని
మన దివాంధత్వమును నవ్వుకొనునటంట
తెలివిఁగొని మంత్రులిఁకఁ గండ్లు తెఱవలేర?
తెఱచి తమమాట నింత చింతింపలేర? 42

కంటె! మంత్రుల వలననే యంట వినుఁడు!
భారతీదేవి కింతకు బ్రతుకుఁ దెఱవు
మీర లవ్వారలందు జన్మించు వీరు
లిట్లు తలవంచికొనుటకే నెట్లు సైతు? 43

తమకులంబు కనంగ మీసముల దువ్వి
వారి వార్చుట యొండెఁ; తా మాఱుటొండెఁ;
గాక యవ్వారి కాళ్లనే కడుగువారు
కలుగనేటికి? తల్లుల కడుపు చేటు! 44

పూర్వ వీర్యము నిలఁబెట్టు పొంకు హీని
నిలుపఁబడఁ డేమికలమని నిమునస మిపుడు
మిమ్ము దాకెడివారలే మేటి మగలో?
గుండెలను గాలుమోపి త్రొక్కుదును నేను. 45

ఇంత రోసంబు నాకుంట కేమికతము?
కారణంబేమి మీ కింత కలుగకునికి?
కాదో! నాయదె మంత్రి రక్తంబు లేక
మీరె మాయందుఁ దప్ప జన్మించినారో? 46

ఒకనిమీఁదవచ్చి యొకకోటి పడినను
శక్తి నెఱపి చావఁ జనునె గాక
పిఱికిపందలగుచు వెన్నిచ్చి యిస్సిరో!
జాతికేల మచ్చ సంఘటింప? 47

ఎల్ల జీవకోటికేనాఁడొ యొకనాఁడు
మరణముండు మాట మఱచినారో?
బ్రతుకు నాల్గునాళ్లు భళిరా యటంచన
బ్రతుకకేటి కింత పాడు బ్రతుకు? 48

కనుఁడు! మీరలు క్రొంపు కవుల చితులు
రవులుచున్నవి భూమి గర్భమున నిపుడు!
పట్టి కలముల కేఁక నేని బదును బెట్టి
ఎదిరి బొమ్మను బగులఁ జీల్చెదరుగాక! 49

తలఁచి సచివుండె తన చేత కలముఁ బట్టి
"వార లెవ్వారొ! యింక రావచ్చు" ననఁగ
మనుజులే యేమి! యవ్వాని మార్కొనంగ
బ్రహ్మదేవునకైనఁ దరంబె? చెపుడ! 50

చాలు నొకమంత్రులే యేమి సభ్యు లిచట
నెంద ఱున్నారొ లెండు! మీ రంద ఱొకట!
ఏమి రాకున్న మానె; మీ కేమి భీతి?
చంపుదును నేన యొక దెబ్బ శత్రుకోటి. 51

నేను బుట్టిన భూమి జన్మించి మీరు
తలఁప నాకును సోదరాంధ్రులుగ నుండి
యెంచునకుఁగాని యట్లు యిట్లేల యుండు?
రింత యపకీర్తి నేను సహింతు నెట్లు? 52

మీరు వాతోడ వీరిపై రాక యేమి
వారితోడనె నామీఁద వచ్చిపడుడొ!
సంతసించెద నేను మీ భ్రాత్రమునకు
మీరు వట్టి కృతఘ్నులే కార దేల? 53

ఇద్ది కూడని దనుచు మీ కేటి కందు
రిపుఁడు నన్నిసడించు వారెవరు? చెపుడ!
ఆను నా మంత్రివారలే కొందఱనఁగ
నింక మీబోంట్ల కిందున నేటి నీతి? 54

దూరముగనుండియే వాడు పేరుజెప్పఁ
గట్టెఱుందుఁ గవిత్వంబు బుట్టునంట
కంటె వా పేరు వీరాను దగ్గఱగ నుండు
నిల్లె యొకమాఱు కవిత మీ కేల రాదు? 55

ఇంతకుఁ గవిత్వమనఁగ మీ కేమి యొఱు?
కేదొ వ్యాకరణమ్మందె యేడ్వబోకు!
హృదయమందున భావముల్ లేఁగవలయు,
లేఁగినట్లుగ మఱి వివరింపవలయు. 56

అవసరము లేదు పాండిత్య మందొకింత
చాలు మీ కూడికొనెడి భావమె పురస్తు
ఇంతకును మించి చెప్పెడే నేమియేద్తు?
నట్టె మీ రందఱికిఁ బోడఁ గొట్టరేల? 57

గాత్రమందున నాగము కళల వెట్టొ;
పద్యమందునఁ జెప్ప భావంబు లట్లు;
వినుటకే కాదు కనఁగఁ గవిత్వ మూట
తేపు రసికులు మఱి విమర్శింతు రంట. 58

ఎవనిఁగా నెంత్రు నన్ను మీ రింత కిపుడు?
నేను పోతన కోర్కె జన్మించినాను
చాల నున్నది చెప్ప వైష్ణవ బలంబు
తెలియుండీ నేను బ్రహ్మకుఁ దీసిపోను. 59

అదిగో! ననుఁజూచి కొను భాగ్యమందకునికి
భావి లోకంబు మిక్కిలి పరితపించు
నింత నామూర్తి మీరు కన్నెదుటఁ గాంచి
మోకరిల్లరు నా పాదముల కదేల? 60

తెలియరో? మీర లింత కాంధ్రుల చరిత్ర!
అందు బాధ్యత యంత్ర నాయంద కలదు
నేన దేశము దేశమే నేనటంట!
అంత గొప్పాట కింక దుఃఖింతుఁ గాక! 61

నాకు నా మంత్రి పీరమ్మ లేకయుంట
రాజ్య మిట్లయ్యెఁ గాక తంత్రిమ్మ దక్క
ఈ నియోగియె మంత్రియై యొసఁగు నేని
దేవునకు శక్యమే? నన్నుఁ దేటి చూడ! 62

ఆంధ్రులే యిట్లి దాస్యంబు ననుభవింప
మంత్రి రత్నమ్మ నన్నెమొ యెంత్రి గాక
మనియె నెట్లుగ ననుఁజేసి మనుమసిద్ధి!
పూజనీయము కాదె! నా రాజభక్తి? 63

ఇంతకు వచింప నెవరు నన్నిట్లకనరు?
దీనదశ నేనుజూడ నా దేశమునకు
నెవరి పాపమ్మొ వారికే యేడ్పుగాక!
తీర్చివై చెద మాత్రు దుస్థితిని నేను! 64

ఆంధ్రలోకమ! యింక నన్నంటెనదువు
మేను నీయండ నుండ నీకేమికష్ట?
మాంధ్రకేసరి నగుచుఁ బట్టాభినగుచు
స్థాపనము జేతు నాంధ్ర రాష్ట్రంబు నెల్లి. 65

తిన్నయింటి వాసాలనే యెన్నుచుందు
వైదికుల నమ్మి యెవ్వాఁడు బాగుపడును?
వలయుచోఁ గాగితంబును వ్రాసియిడెదఁ
గాదు బూటకమిద్ది; జగత్ప్రసిద్ధి! 66

నేఁడు పోతన జీవించి లేడుచూడ
సంస్కృతము నాకు రాదింత సత్యముగను
"మాకెవరు సాటియను" వీరి లోకమెఱుఁగు
నింక నీమీసముల దోస మెట్లుపోవు? 67

అరరె! మఱచితి నొకమీస మాంధ్రమునను
నిక్కుచున్నది కద! యిందు నేనయనుచు
నింకఁ బోతన కిపుడు కళంకమేది?
దిట్టకవి నేను గానో యీ తెలుఁగుభాష? 68

ఇందు నామీసమింక నేమేనియనిన
నేను జెప్పఁగరాని కొన్నింటిఁ జెంతు
దోసమననేల? పీకుత రోసమున్న
మీఁదఁ జూతము రెండవ మీసమేమొ! 69

ఏల కన్నెఱ్ఱఁజేయ బుధేంద్రులార!
కొంటెమాటల సభవాడు చుంటిననియ?
యేనెఱుంగనె? నను క్షమియింపవలెను;
కంటె! యిదియీడ నెంతచక్కని జవాబు? 70

ఎందునకుఁ గాక మీసంబు లింతబెంచి
దండిమగలున్న మమ్ము గెల్వొండటన్న
నెందు గెల్వంగ వలెపీరి నిట్లుగాక!
సంపదమరేభ్యులార! యోసభ్యులార! 71

ఏమహా కవికింక ♦ నీ సృష్టిగాదన
బ్రహ్మపేరున భూమిఁ ♦ బరగువాఁడు
సంస్కృతాంధ్రమ్ముల ♦ జగమెల్ల మెప్పింప
భయద ప్రతిజ్ఞను ♦ బట్టువాఁడు
కవులన్నవారున్నఁ ♦ గనరారె నా కంచుఁ
గంచు ఢక్కలఁ బగి ♦ లించువాఁడు
దిగ్గజంబుల గుండె ♦ దిగ్గురు మనుచుండ
గండ పెండేరంబు ♦ గాంచువాఁడు

చచ్చిపోయెనో వైదిక జాతియొకట?
గంటెఁ ద్రిప్పుచు నున్నదో వంటయింట?
మొలవనేలేదో మీసలే మూతికేని?
మాయురే! వచ్చెనే నేఁడు మగతనంబు? 72

ఏను నిమీసముల వారి నేమిచెప్ప?
దేనుఁగును నెక్కివామని యెగసిరంట
ఇంక ధరణీశు లరయంగ నెక్కిరంట
ఎంత యేనుంగు? భళిర! వారెంతనృపులు? 73

ఇట్టివీరలు మంత్రుల నేమొనవ్వ
నేన్గుపై నెక్కి వెనుక యూరేఁగువాఁడు
గంటెఁబో వంట వాఁడు వెన్నంటియేఁగ
నెంత యౌచిత్యమందు తప్పేమికలదు? 74

అవని మాకీడువచ్చెడి కవులఁజెప్ప
శూద్రులందునఁ గొందఱఁ జూతుఁగాక
వైదికుల నొక్క నన్నయ భట్టుతప్ప
నరయ నందఱు పప్పుబ్రాహ్మణులె కాదె! 75

ఉన్నమాట యన్న నుడికిపోదురుగాని
అసలు మీసలేమొ యడుగరేమి?
ఏలవచ్చె నింత? యెఱుఁగఁ జెప్పడొకింత?
మంటఁ గలిసెనేమి మంత్రికులము! 76

నేఁడు కనుగొంటె చాకలి వాఁడుగూడ
గాడిదను నెక్కి మురియుట కలదటంట
వాఁడు వీరలమించిన వాఁడెయేమొ!
గాడిదలుకూడ నిఁక మహాకవులె యేమొ! 77

ఇంతమాత్రికు వీరింత యెగసిపడుట
ముందువచ్చిన చెవులఁ గొమ్ములుహసించె
నింతలేసి మొగాల నింకేమి చెప్ప?
నెవరికీర్తిని గూర్చి యింకేమితడవ? 78

ఇంత కరయఁగ నేనుంగు నెవ్వరెక్క
రెక్కరేయనుఁ డేమిటి కీబడాయి?
"వైదికున కేనుఁగును మించిలే" దనంగ
నేమొ యనుకొంటి! నేనిప్డు తెలిసికొంటి! 79

వంటలే లోకముగనుండు వైదికుఁడు
నెక్కపడఁడేటి కేనుంగు నెక్కనప్పు
డల్పుఁ డగువాఁడు సిరిని దూఁగాడు వేళ
నర్ధరాత్రము గొడుగు చేయుంమఁగాదె? 80

మఱచిరి కాంబోలు? ♦ మనుమసిద్ధి నృపుండు
"మామా!" యటంచు న ♦ న్నోముకీతి!
కనలేరు కాంబోలు? ♦ గణపతి దేవుండు
నిలచి నా యాజ్ఞ మ ♦ న్నించు విధము!
రిత్తయే కాంబోలు? ♦ రెడ్డిరాజులు నాకుఁ
గనకాభిషేకంబు ♦ వినుచుమాట!
ఎఱుఁగరు కాంబోలు? ♦ కృష్ణరాయ విభుండు
నేనెక్కు పల్లకి ♦ నెత్తుతగవా!

ఇంత నామముందు నొకయెన్న సంతరించి
యంతరాజుల నెవరినో వంతుగలిపి
సిగ్గులేకుండ ఘనముగఁ జెప్పనేల?
హాతులుగాకుండ నింకను బ్రతుకనేల? 81

ఎప్పుడును గూపమున నుండు కప్పనడుగ
దాసి నే నెప్పునంట! "సంద్రిం"బటంచు
నెప్పుడును వీరు నాకీర్తి నొప్పకుండి
యెన్ననెక్కియె నీల్గిపోయెదరు పొమ్మ! 82

పుడమి మఱివీరి సంభవమున నెయంట
సన్నుతింగాంచె నియ్యాంధ్రి సాటిబోంట్ల
నింత కేడ నమాత్యు లదేమిలేదు!
వింటె! కవిలోకమా! నీవు వీనులొగ్గి? 83

సత్యమే కాదె! యిపుడు పసందుగాక
ఆంధ్రభారతి యీమొగా లరయువఱకు
ముండముసుఁగున నొకమూల మూల్గుచుంట
నెవరెఱుఁగరు? క్రొత్తగ నేమిచెప్ప! 84

పొగడినంతన మాకేమి పోవుననుచుఁ
బూని మా వారలేమెంత పొగడరాదు
తమను దలఁదన్ను మంత్రులఁ దామెఱింగి
యిట్లు విను వీరికైన సిగ్గేలలేదు? 85

ఇంతటను బోక వీరలే యింక మీఁద
జాతియందున లేని మీసములఁ బెంచి
"ఆంధ్రమునఁ గూడ మే మె"యం చాడిరంట
దలుపఁదగు నింక వీరి దుందుడుకుతనము. 86

"చతురకవిత్వ తత్త్వపటు
సంపద యొక్కరి సొమ్ము గాదు భా
రతి దయ సౌధవార్ధి; కవి
రాజుల మానసముల్ ఘటుంబు, లా
యతము కొలంది లబ్ధమగు"
నంచని మాసచివుండె యేద్వయే
మతమున వీర లింతటి హి
మాకతు బూనిరో చెప్పరేకవుల్? 87

"జిలిబిలి పలుకుల వెలఁదీ!
పలుగాకి నకారగుళ్ళ పాలైతిగదే?
యిలలో వైదిక విద్వ
త్తిలకంబుల కేది దిక్కుఁ దెలిపితివమ్మా!" 88

అనెడి వీరల నెవ్వారు నరయరనఁగ
నాంధ్రమున మే మె కవులమం చాడ నేమి?
యెందునింతకు విస్సిరో! యేమి లేక
యీ యభాగ్యుల కింత బడాయియేమి? 89

మాయమూర్త్యులఁ బోలు సామర్థ్యమున్న
కలము నడిపించుటలఁ జూపవలెనె కాని
జాతికేలేని యట్టి మీసంబులేమి?
మేకపోతుల గడ్డంబె మేలుగాక! 90

ఎంతకునుగాని వీరలే యింతవచ్చి
యెందునను లేని యీమద మందిపోవఁ
గొంత కలవారలింకేమి కూయకుంద్రు?
ప్రబలెనే భాష నింత యరాజకంబు? 91

ఎవ్వ రెట్లాడనిమ్ము! యేమేనిఁ గాని!
యీయడావుడి నేను సహింపనోప
నాంధ్రభారతీ ప్రతినిధి నగుచునింకఁ
బంతమున వీరి నేన శాసింతు గాక. 92

లేశమాత్రముఁ దురకలు లేనియూర
నరయ దూదేకువారె సయ్యదులటంట
దుడుకుఁ దనమొంచు నొకయమాత్యుండులేక
కవుల యందున వీరెపోఁ ఘనులు నేఁడు. 93

ఇంత మొనగాండ్రు మున్నెప్పుడిలనుబుట్ట
రింత పాండిత్యమే యొక్కఁడెఱుఁగఁజాలఁ
డింత యీకైత నెవ్వఁడు నేర్వనేరఁ
డేల? మాబిచ్చమంది మీసాలదువ్వ? 94

పదునెనిమిది పర్వంబుల భారతంబుఁ
దెలుఁగుఁ జేసిన కవిరాజు కలఁడుగాని
యింత పొగరుతనంబు నే నేడఁజూడ
వీరి బలమెంత! వీరి కవిత్వమెంత? 95
ఆంధ్రిలోకము! యిందునా యాడుచుంట
"శయ్యరే!" యని దిక్కుల నరయవలదు
దివులు విడనాఁడు నీవింకఁ దెలియఁజూడు
వీరి పెద్దతనంబు నా పిన్నతనము! 96
అదిర! పైపెచ్చు నను సభ నెదిరికొనఁగఁ
బ్రశ్నములఁ జేతురఁట! వారి వారితోడ
దిక్కులన్నియు మఱచినాఁడె తెలియునంట!
వారి ముసలిబలంబు; నా వయసుబలము. 97
ఇలను నేటికి వారనేకులను గెలిచి
యాఱితేఱిన వృద్ధులై నారనంగ
మొన్నబుట్టిన యట్టి నాబోంట్లు భళిర!
బ్రతికి పోవుట లంతటి వారినెదిరి? 98
ఎదిరి బలమెంతయో దాని నెఱిఁగియెఱిఁగి
తగుదుననియేటి కింక యుద్ధంబుఁ జేయ
నింతటి కవీంద్రు లనుచు నాకేమి తెలియు!
వడఁకునిప్పుడు దేహంబు భయముగదిరి. 99

అగరె! సభ యున్న మాటకే నదిరిపోయి
కాళ్ళఁబడుదువె? యీయహంకార మేమి?
సభలమొగ మేమెఱుఁగమో జగతినెపుడు?
తలఁపఁ డానొక్కఁడే యేమి దండిమగఁడు? 100

అయినఁ గాడేల? యేల కాదనఁగవలెను
నేను నిప్పుడు కచ్చ బంధింతుఁగాక!
వీరలను గన్న తల్లియే వీరమాత!
చూడ మాతల్లి యంతటి క్షుద్రియేమి? 101

అందు నీయాంధ్రభాష యుండంట తాను
దండి మగఁడయి నన్ను విదల్చివేయు
ధరణి నెందేని నీవిచిత్రంబు కలదె?
వంటయింటనె యుండేటి పరువు? తార! 102

"ఆంధ్రభాషాస్వరూపు లియ్యవనివీర"
లనఁగ నుతియింతు రింత కేరిని జనంబు
లయ్యు మాత్యుల నొక్కఁడ నగుచుఁబుట్టి
యింత విపరీత మెట్లు సహింతు నేను? 103

అనినమాటకు వెనుక దీయఁగవలవ
దొకరు వీరేయి? వీరిశిష్యులు నదేమి!
పొంచిరానిమ్ము సర్వప్రపంచ మొకట!
శృంగ భంగంబుజేసి పుచ్చెదను గాక! 104

ఇంక నిందెవ రేని నిదేమటన్నఁ
బట్టెదఁ బ్రతిజ్ఞ భూమిగర్భంబుఁ దన్ని
ఏను నామాటఁ దప్పిపోయిన వినుండు!
ఉద్భవింపఁగలే దమాత్యుండ నగుచు. 105

జగతి నేకైక కవిగ మీసములఁ బెంచి
హీహీహీ! సభపేరు పెద్దగ నేలచెప్ప
నాంధ్రవాఙ్మయక్షోణి సల్లరయుమండ
గ్రోలివై చెద నాయొక్క గుటక కేను. 106

నా కవిత్వమునందు నీనాఁడు బుట్టు
పిల్లవాఁడును దప్పు జూపింపవచ్చుఁ
గాని, ననుజప్పటలఁ గొట్టఁ గలుగుమగఁడు
ముజ్జగంబులఁ గూడను పుట్టఁబోడు. 107

"అంత యేమంచు" మఱియు నహంకరించి
యెందఱేతీరు గూడి దండెత్తరాదు?
అపుడునే నసమర్థుఁడ నగుచుఁగూడఁ
బందె మొగ్గెద; నాతల వంపఁబోను! 108

గగనచుంబిహిమాల యాగ్రమున నుండి
"తలఁప నీసొమ్ము మాయమాత్యులదె గాక
యింక మాముందు మీకైత యెంత" దనుచు
నెందఱినో వాకొని యతిశయింతు నేను. 109

తిక్కనామాత్యుండు ♦ తిక్కతిమ్మిరిఁ బాపు
నాచన సోముండు ♦ పీచ మడఁచు
శంభుదాసుఁడు కిన్క ♦ శారదనే మ్రింగుఁ
బోతన్న తాతము ♦ త్రాతనడుగు
శ్రీనాథుఁ డెదురేగి ♦ చెంపలు వాయించు
ముక్కుతిమ్మన లేచి ♦ ముక్కుబట్టు
గండపెండేరంబు ♦ గర్జించి తొడఁగొట్టుఁ
బింగలి యాఁకొన్న ♦ సింగమగును

ఇట్టివస్తాదు లిరికెంద ఱిందయుండఁ
జాలు నమృతోక్తు లెట్లు పసందుగొలుపు?
నెవఁడు రా! మాయమాత్యుల నీసడించి
కలమునడిపెడి మొనగాడు తెలుఁగునేల? 110

తానుగోడాడ్రిలు గాక నా తల్లి నేఁడు
కడుపుచేటుగ నన్నిట్లు గాంచుగాక!
ఒక్కయీ నేను తమకు రాకున్నమాత్ర
కేమి నాజాతి మాఱిపోయెదరె వీరు? 111

ఇందు నాజాతి మాట లేదందురేని
యింక నామీఁద నార్భాట మింతయేల?
అవనినాజాతి యట్లు యున్నంత మేర
కేను తలవంచికొనఁగ నాకేమివచ్చె? 112

పుడమి నేఁ దిక్క యజ్వనై పుట్టినాఁడు
దయను బ్రతికించితిని గాక తలఁతు నేని
పట్టి యాదిసభారణ్య పర్వములను
నణఁగఁ ద్రొక్కెనె? పాతాళమునకు నేను! 113

అట్లు నేఁ జేయ నింకనీ యాంధ్రభాష
చెఱగిపోసెడి దగు వట్టి చెత్తగాక!
కలదె? మాతోడ జెప్పెడి కవితయొకటి!
గుండెకలవాఁడు రావచ్చు గొంతునెత్తి. 114

వచ్చి నాయాడుమాట పూర్వదునఁగాని
యిపుడు పనిఁ జేయదంచు నేమియునినఁ
గనరె! సౌందరనంద మొకండె లేచి
యవలఁదన్నెడి నేఁటికావ్యముల నెల్ల 115

అరరె! పొరబడియే నేమి యాడితిపుడు?
గురువుగారేమి? మీసల కుకవిదాని
కద్దివారల భిక్షయే యగున చెప్పు?
నయిన నేనేటి కిడదాని కంతగొప్ప? 116

ఏమి చెప్పుదు నాగ్రంధ మిట్లుగొనుట
గ్రుద్దినట్లుంట పిడికిటఁ గుడుచుఱొమ్ము
మాటలాడిన నేమొకో! సూటివలయుఁ
గ్రిందినలుపును గురువెంద గింజకనదు. 117

ఏను నాకయి గౌరవమిచ్చి నప్పు
డద్దికాదను వారెవ్వరైన నేమి?
ఏను నాధర్మమును నిర్వహించుపాంటె
తలఁగుఁడనియెద వాకు శాత్రివులువారు. 118

అప్పుడీయల్ప జీవియే హాస్యమనక
చూపఁగాఁదెచ్చుఁ దనవాత్రియు "సూరబాల"
నేదహా! యింకనాకల మ్మెదిరికొనఁగ
నిలువఁగల కావ్యమొక్కటి నిశ్చలముగ? 119

ఏమిలాభమ్ము? నాకైత యెంతదనుచుఁ
బలుకు గర్వాంధులనె తన్నవలెనుగాక!
నాకవిత్త్వంబు నెవఁడు కొనంగలాడు?
నాదు క్రోధాగ్ని కెవఁ డింధనంబుగాఁడు? 120

అద్దివచియింప నెక్కడఁ బొద్దుపోక
నేదొపనిఁ జేసికొని రచియించినాఁడఁ
బెదవులదరంగ నింకనొక్కఁడఁ గలంబు
నాలికి యొలికింతు నింక మంత్రిలబలంబు. 121

పోవనీ! మన్ననఁ ♦ బూర్వమంత్రి కవీంద్రు
లొకనితర్వాత నొ ♦ క్కొక్కఁడట్లు
లేకపోనీ! మొన్న ♦ దాఁక జీవించిన
నాంధ్రి వాల్మీకి వ ♦ ద్దాదిమగలు

నారసీ! యసహాయ ♦ వీరులై మెసఁగిన
నాశుకవీంద్రసిం ♦ హములజంట
ఉండదనీ! మీసాల ♦ కండగా శిష్యులై
కాటూరి పింగలి ♦ ఘనులునేఁడు
కంటె! నాశక్తిగవ్వకుఁ గాకపోని
జగతికంపింపఁ బోరాడి జత్తుగాని
నే నమాత్యుఁడనై మేనఁ బ్రాణముండ
నంతనాజాతి కెట్లు సహింతునింత? 122

ఏతపంబులఁ జేసియో యేమొతెలియ
మాపొలంబునఁ బుట్టెడి మాటగాక!
భారతీదేవి మేనిజీవంబు లయిన
మాకలంబులకా యీ దిమాకిఁజూప? 123

"ఏప్రపుల్ల పుష్పంబుల నీశ్వరునకుఁ
బూజనల్పితినో యిందుఁ బుట్టినాఁడ"
ననెడిసోదర కవిమాట విను*ను*ఁగూడ
నీమొగంబుల కేల మన్మెదిరియాడ? 124

ఇంతకునువచ్చు వీరినిం కేలవిడువ
నిందు ధర్మంబు నింకనా కెవరుసెప్పఁ
జల్లకై వచ్చి ముంతదాచంగ నోప
నెదిరిబలమే మొ చూచితీరెదను గాక! 125

చెప్పఁగలవారలెవరో ప్రశ్నింతు నేను
ముసుఁగులో గ్రుద్దులాటలు పొసఁగవింక
నొక్కమాటకు మేమమాత్యులము లేక
కవివరుండేడి? యవ్వాని కవితయేది? 126

ఎవరినో యేమి? యిపుడయేమేమొ ప్రేలు
వానికవితనె యడుగుచున్నాను నేను
తగుదునను వాఁడు మానుగ్రంథములఁ బోలె
వెలికిఁదీయుత! పదిపద్యములనె తుదకు? 127

ఒకఁడువీరల పాండవోద్యోగ మిచట
సిగ్గులేకుండఁ బెద్దగఁ జెప్పునంట
మామకోద్యోగ పద్యంబు మఱినెయున్న
వేగ మరణింపఁడే వాఁడు విషముద్రావి? 128

బిడియమును జంపి యాహార బిచ్చమరిగి
మేము మేమని పెగ్గెల నేమొగొట్ట
కానని మొగంబులకె మహాకవులుగాక!
ఏదిరా! పీకైత మాకేమి చెప్పు? 129

చూడు విశ్వంభరా! నేను నేఁడు మొదలు
భాషయందున నాకున్న ప్రజ్ఞఁ జెప్పి
ఆంధ్రభారతి గ్రంథాలయంబు నుండి
యింక నవ్వారి కైత బహిష్కరింతు. 130

ఇందుహామాట కింకనీ వేమియనకు
మింతమాత్రికు బోవున దేమిలేదు
భాగతీదేవి బ్రతుకు మావలనఁగాక!
మెవ్వరుండిన నేమి? పోయినన దేమి? 131

ఇట్టియొక యిద్దఱకు నీవిదేమటన్నఁ
దలఁగిపొమ్మింక మాయమాత్యులకు నేని
చెప్పుమీరెంట జేనికీ వొప్పుకొనదొ!
పిదపవాపోయి లాభముండదు ధరిత్రి! 132

వచ్చినకవిత్వ మదియేదొ వ్రాసికొనుచు
వారివీరల వలెఁదాము నూరకొనక
ఏలనే? యేమియును లేక యింతయెగసి
జాతియందున లేని మీసముల దువ్వ? 133

వ్రాయుదునా? యింక ♦ భారతగ్రంధంబు
నేభారతంబు న ♦ న్నీసడించె?
భాషింతునా? లేక ♦ భాగవతంబేని
నేభాగవతము నా ♦ కెదిరినిలచె?
రచియింతునా? పోని ♦ రామాయణంబైన
రామాయణంబేది ♦ భూమిఁదన్నెఁ?
గల్పింతునా? గాక ♦ కావ్యంబులొక కొన్ని
యేకావ్యమంతటి ♦ "కీక"ఁబెట్టె?

నధికమున కేల? నింతనా యంత కేలఁ
గొంత దూరాని కైన వాకొనఁగ నేది?
యింకఁబనివడి యేగ్రంథమేను వ్రాయ?
నింకనీబోంట్లు పెద్దగ నేలఁగూయ? 134

నాకవిత్వంబు జదివిన లోకమదిర!
ఆసభాపర్వమేను వ్రాయకవిడుచుటఁ
దనయభాగ్యంబుగా మదిఁ దలఁచునంట
ఇకమహాకవి నన్నయ్య నేమిచెప్ప? 135

ఆయొక యింతనెప్పెడిసి
యక్షర రమ్యతఁ గూడమూడు నా
రాయణ భట్ట మంత్రికొక
గ్రాసమొసంగుటనే తలిర్చెఁగా
కీయిల నన్నయార్యుఁ డొకఁ
డేయయి యేమెడ నేమిసేసె? నే
లా? యిఁక బిచ్చమెత్తెడి క
లంబులఁజూచుచు మమ్మునేఁచుటల్! 136

ఇంతఁదీఱనె? నన్నయ నెఱుఁగ రెవరు?
వచ్చునే యాతనికిఁ గవిత్వంబు మొదట?
భట్టమంత్రి యొకండె యప్పగిది వ్రాసి
యట్టె నన్నయ్యపేరును బెట్టెఁగాక! 137

కీని దెలిసియు దయనెంచి తిక్కనార్యు
డతఁడె తద్గ్రంధకర్తగా ననఁడదేల?
వలయునేచెప్ప నికఁదరువాతి కవుల?
నున్నదియ "గోత్రదాటు" డటన్నమాట! 138

ఇట్లు యొకదెబ్బ కెగిరిపోయెడిని వాని
నాదికవియనఁ జెల్లునే యాంధ్రమందు?
నందు నాశంభుదాసుఁడే మునియెనోక్క!
నవ్వువచ్చెడి నదివింటె నాకునెపుడు. 139

అయరె! యీయాంధ్రభాష నన్నయకుముందు
నెన్నకాసట బీసట నున్నదంట
యెవరుచెప్పిరోకో! తన కీరవాస్య
మాతనికిముందు నెన్నికావ్యములు లేవు? 140

ఎన్నియనుమాట కాదు బుధేంద్రులార!
గుట్టగాఁజేతు వానిని గుప్పఁబోసి
ఇంతకునుమంచి గ్రంధంబులే సుమండి!
ఇదిగో యిప్పుడ తెత్తునా యింటినుండి. 141

ఓసి! మఱచితి నీశంభుదాసుగారు
వ్రాయరేతాను నొక్క రామాయణంబు?
నద్దిజూతము దానిఁదెమ్మనుఁడు మొదటఁ
బిదపనావాని నేను జూపింపవచ్చు. 142

అద్దిమీచేతఁ జిక్కకున్నదియయేని
నతఁడుదానిని వ్రాయలేదన రదేల?
ఇంకఁ బూర్వపువిల్లు పోయినవటన్న
నందునంగూర్చిమీ కేటికబ్బురంబు? 143
అద్దిలేకుండ నావితెమ్మందు రేని
నొప్పికొంటిరి మీరువాకోడి నట్లు
వానిఁ దెచ్చితినేపొందు బండ్లమీఁదఁ
జెప్పుడవ్వాని నేమిజేసెదరు మీరు? 144
ఇట్లునేజూచి నీకట్లయిత్తు మనుచు
మాననీయులు మీరందురైన నేమి?
వానిఁ దెచ్చుటకే నేఁగినానటన్న
వెంటఁ బరుగెత్తిరారె వావిళ్ళవారు? 145
వారలొకరేన? బాపురే! వారివెనుక
రాకయుందురె? శేషాద్రిరమణ కవులు!
వచ్చిమావారు వ్రాయుకావ్యాళి కెల్ల
పీఠికలుగిల్పి కారేమి? పెద్దకవులు 146
జగతినిపు డున్న వేమారుఁ జాలుననుచు
మంటఁబెట్టెద వానినన్నింటి నేను
నన్నయకుముందు నాంధ్రవాఙ్మయముఁజూపఁ
జాలదా! యుద్ధమల్లుని శాసనంబు? 147

దానియందలి భాష యాంధ్రమ్మె కాదె?
అందునఁ గనుంగొనంగ పద్యములు లేవె?
యేటికీ వితండవాదంబులింత యెఱిఁగి?
హిం!హిం!హిం! యని నవ్వరే యెవరేని విన్న? 148

చూడనింతకు నన్నయనాఁడె కాదె!
మంటబడినాఁడు మల్లనామాత్యుఁ డొకఁడు!
వినుచరే! యింక నాకునో వెఱ్ఱిలాఁక?
ఆదికవి యెట్లు నన్నయ యాంధ్రమందు? 149

ఈకలియుగాన నీభావ మింత కరయ
"శాతకర్ణి" నృపాలు నాస్థానముండి
మాయమాత్యుఁడు దేవళరాయఁ డొకఁడు
స్థాపనము జేసెనో యీవిచార మేల? 150

ఈయది నన్నయార్యుఁడె ర
చించె నటంచను రీతి నక్కటా!
యోయన భారతంబున క
హీనబలంబున గంటమంది తా
నీయిల నొక్కయూరున కొ
కింతయుఁ గీర్తిసి గాంచఁడట్టి నా
రాయణభట్ట మంత్రికి క
రంబుల మోడ్చి నమస్కరించెదన్. 151

భాగవతమేదో మేము వ్రాసితిమను
గర్వమేయేమొ యీసీల్లు కారణంబు?
దానవే వీరలింకఁ బోతన్నలయిన
కలముబట్టిన వారెపో కవులునేఁడు! 152

ఏనువ్రాయంగ వీరలు నేమొవ్రాసి
'యేమ్ము' సంచని యిటుతల నేలయెత్తఁ?
బేరునకుఁగల్గు కస్తూరివారి యిండ్ల
నింకనా గబ్బిలముల కంపేలఁదడవ? 153

శంభుదాసుఁడన్నంగ నిజ్జగతి నేను
వ్రాయు రామాయణము కనరాదుగాక!
అయ్యరే! దాని రచనమేమని వచింప?
నద్దినాకిట జ్ఞప్తిలేదయిననేమి? 154

"ఆంధ్రవాల్మీకి" యను బిరుదంది నిన్న
నారచించిన రామాయణంబు కలదు
దాని కేచాలు నేదిసమాన మగునొ;
యెంచి యెవ్వాఁడెకాని వచించుఁగాక! 155

ఇట్టి నాపరిశ్నముంటనే యేమొయొకఁడు
వ్రాయుచుండెనటంట రామాయణంబుఁ
జచ్చిపోయిన మావారు చావనిమ్ము!
బ్రతికెదనుగాక నేను నాబలముఁజూప! 156

చూచినాడను దానిమచ్చునకుఁ గొంత
భాస్కరునిముందు చుక్కల వర్ణమెంత?
నిక్కమునకు గోపీనాథు నిదియులెస్స
తలఁచెదను నేను దానిమెత్తుందనమ్మ! 157
"చెలువుమీఅంగ మీకులోపలికిఁ బోయి
రహి సుమంతుండువచ్చి ద్వారమున వేచి
యున్నవాఁడని నారాక యొప్పమీఅ
మొనసి రాముని కెఱిఁగింపు డనిన వారు." 158
ఇట్టిపద్యమ్ములెన్నని యేమ్పగాక!
నేను వానిని దయనుమన్నించినాఁడ
నదికనుఁగొంటె గీతపద్యమ్ము కాదె?
వ్రాయఁదరమానె? దానిని వైదికునకు! 159
ఇతఁడొక మహాకవీంద్రుండు చిలవచింపఁ
దానురామాయణము వ్రాయఁ బూనెఁగాక!
ఎఱుఁగ రెవ్వాలీతని కఱకుకవిత?
విశ్వనాథయనంగ నవ్వేదరు కాదె! 160
ఏనుజెప్పెద నితనికి హితమొకండు
తగఁడు తానింతయును గవిత్వంబువ్రాయ
బాగుగానుండు నవలలు వ్రాసికొనిన
నీతఁడీఁకముందు నందు శ్రమించుగాక! 161

ఇట్లువచియించు నామాట కీతఁడదిర!
కోపమునఁబండ్లు పటపట గొఱుకునంట
యెవనిఁగా నెంచి వాఁడీతఁ డేననంగ?
నాంధ్ర వాఙ్మయమునకు నియంత నేను! 162

ఇంత కీతనిదేకద! యేకవీర
దాసనే వ్రాయు మనెదఁ బద్యంబులందు
వెనుకదీయంగ వలవ దీవిశ్వనాథ!
తననుమించెద నేను గీతములవ్రాసి. 163

ఇందునీతని కోడిపోయితిన యేని
నా "యనూత్న" పదంబుఁ దీయువాఁడ
నొకట నటుగాక తానె నా కోడునేని
వినఁదలంచెద నేమొకో! తనప్రతిజ్ఞ! 164

డంబుఁజూపి ధరాత ♦ లంబుపైఁ దిరుగాఁడు
కవిమీఁదఁగాని నా ♦ కవచమేయు
దుష్ప్రయోగంబులఁ ♦ దొఱకొని చెప్పెడు
కవిశిరస్సునఁ గాని ♦ కాలుచాప
సంగీత సాహిత్య ♦ సరసవిద్యలు చేర్చు
కవుల బొమ్ములు గాని ♦ కాల్చివిడువఁ
జననిఁ చెప్పఁగ నేర్చె ♦ సభయందు విలసిల్లు
కవినోరుఁగాని వ్ర ♦ క్కలుగఁదన్న

ననుచు శ్రీనాథుఁడనఁగ ముందాడినట్టి
నాబలంబును మఱల వినంగఁజేతు
నతురజ్ఞాన మున్ననో యాంధ్రజాతి!
ఆలకింపుము నాకు సాష్టాంగమిడుము! 165

ముందుఁ దిక్కనపేరఁ ♦ బుట్టిలోకంబునఁ
గందంబునకుఁ గీర్తిఁ ♦ గాంచినాఁడ
నటుమీఁదఁ బోతన్న ♦ యనునామమున వచ్చి
వృత్తంబులకు భిక్షఁ ♦ బెట్టినాఁడ
నానాఁడె మఱిఁజెప్ప ♦ శ్రీనాథుఁ డననుండి
సీసమ్ము నాసొమ్ముఁ ♦ జేసినాఁడ
నింక నేటికి రామ ♦ కృష్ణమంత్రి యనంగ
గీతంబునకు గీటు ♦ గీసినాఁడఁ

బ్రతిభయన నిట్టిదైయుండ వలెనుగాక!
నెన్నిగ్రంథంబు లెంతగ నేలవ్రాయ?
వేయునేటికిఁ దెలుఁగుఁ గవిత్వమనిన
నేనొకండనె గుత్తకొన్నాను జగతి! 166

ఇంకనీకైత మావాని నెదిరియాడఁ
దమనుబుట్టించు బ్రహ్మకుఁ దరముకాదు
పందెమొడ్డి వచింతు నభంబుఁబగుల
నాంధ్రభారతి మాయింటి యాఁడుబిడ్డ! 167

అవనినాట వాఁడెవ్వఁడైనఁగాని
యెంచి చూకింక నౌదల వంచఁడేని
పారఁ ద్రోలెదవాని ద్వీపాంతరంబు
వినరె! కవులార! యీ మహాత్మ్యుని ప్రతిజ్ఞ! 168

భళిర! తిరుపతి వేంకటేశ్వరుఁడె యుంట
కాదె తిరుపతి వేంకటకవులు నేఁటి
కింక నా దేవుఁడేటికి శంక నాక
కనుఁడు జనులార! మీరలీ కవులపదము. 169

ఇట్లు చెప్పెడి వారి నేనేమనందు?
నారికేసుంత సిగ్గుండ వలెను గాక!
పేరునకు లేదె? యిల నేతి బీరకాయ!
వలవ దవివేకమింత యెవ్వారికైన. 170

అరరె! నామంబులొకటి యైనంత మాత్ర
కెగురవచ్చునె? దేవుఁడే యేమటంచు
నేనెఱింగిన యనసూయ యింతమాత్ర
కత్రిముని పత్నియనసూయ యౌనె? చెపుఁడ! 171

నృపు లనేకులు తమకింక నేస్తులయిన
నొకని యాస్థానమందుంట కొప్పరంట
అదిర! యిట్లుండవలయు నాత్మాభిమాన
మిపుడు పోతన తలపఁడెట్లు? చెపుఁడ! 172

చూచు సంస్థానములకెల్ల నీచమనక
పోయిపొగడిన పోకలఁ బోవనిందు
కడకు నిల్లాండ్రఁ గూడనొక్కెడ వచింపఁ
గలరె? వీరలమించు హీనులు ధరిత్రి? 173

ఎందఱోయింక సిల్లై తమ్మిసడింప
నేఁడు సత్కవినైయుంట గూడ దోస
మనుచుఁబెద్దగ మఱిసెప్పు కొనుదురంట
ఎందును స్వకుచమర్దన మింతయున్నె? 174

అరుగనేమిటి కట్టుల నంతదూర
మర్త్యులేవీర లోకకవులనుట కేని?
ఏమిలేకుండ నెందున నింతగాక
గర్వమునుగొట్టు వట్టికాకవులు గాక! 175

తమదు గ్రంథంబులకు దివసములెగాక
పట్టవటమాసములు మఱి వత్సరములు
చచ్చు గ్రంథంబులకు దివసములెగాక
పట్టునేమాసములు మఱి వత్సరములు? 176

ఆశుధారా కవిత్వంబటన్నమాట
నడుగ నల్లేరుపై బండి నడకయుంట
ఘనముగాఁజెప్పు పద్యమొక్కటియు లేక
నెన్ని కోఁతలఁ గోసిననేమి? చెపుడ! 177

ఇంక సత్కావ్యములమాట నెన్నతమకు
షడ్రసోపేతమైన భోజనమె యంట
దీనిఁగూర్చియు నొక్కింత తెలుపుదేను
చక్కఁగా నాలకింపుడో సభ్యులార! 178

తనవిన్నాణము నేర్పరింపఁగల స
త్కావ్యం బొకండేని మ
చ్చునకున్ లేకనెపోని కంటె! యది వా
క్ఛూరత్వమే కాని యం
దును సిగ్గేటికిలేదో! చెళ్ళపిళ్ళ శా
స్త్రుల షడ్రసోపేత భో
జనమున్మాత్రము విస్మరింప రదిరా!
జాతీయముల్ తీయముల్. 179

రామకృష్ణకవీంద్రుల నేమొ పేర్లు
తనకవిత్వంబు ననుఁజూచికొని వచింపు
డారఁజేసెద నట్టుల గీరతమును
పర్వములఁ బెట్టివ్రాసెడి గర్వమేను. 180

ఓరి దేవుఁడ! అంతకే గీరతంబు
భారతంబానె? తాఁగవి బ్రహ్మయానె?
వ్రాయఁడేటికి తగునేని భారతము నె?
యిల్లలికినంత పండుగ యెట్లౌను? 181

పంతముననింకఁ బద్యముల్ వ్రాయునపుడు
హస్తమును గోయనగునంట యాగెనేని
బాపురే! యేరికున్నదీ ప్రతిభజగతి?
కంటె తిరుపతివేంకట కవులెకవులు. 182

ఈప్రతిజ్ఞలు వెఱ్ఱుల కేర్పరింప
చెల్లరేయంచు వారుమెచ్చెదరు గాక!
చెప్పనేటికి మామంత్రి శేఖరులకు?
కుప్పిగంతులు హనుమండు గొప్పగానునె? 183

వ్రాయకుద్యంబు లేవొకోపన, జెలంగి
భళిర! యననుండుటయె మొదువలయుఁగాని
కలము నాపకవ్రాయుట కనునెవండు?
కలము నాపుచువ్రాసిన కనఁడెవండు? 184

కలదు గదతిక్కనార్యుని కథయొకండు
నాశువు వచించుతఱియింత యాగడనఁగ
దెలియవచ్చెనుపో నక్క పులినిజూచి
వాతలం బెట్టికొనియెఁ జెప్పంబనేమి? 185

పౌండ్రికులటంట యింకఁ గొప్రింపుకవులు
తలఁపఁ దామేమొ వాసుదేవులరటంట
మేమెపెంచితి మిపుడిట్ల మీసములను
విశ్వమెఱుఁగదె? మాయది వెధవజాతి! 186

మాయరే! యింక మొల్లరామాయణంబు
నట్లుగా వ్రాయుటకు నమ్మరంట తాను
పేరిమరచియించిరట యామెపేర నెవరో
వింటిరే! మీరుదీనినో విబుధులార! 187

ఊర్వసిపుడామె జీవించియున్న యెడల
నీకుఁబలె మీసములులేవు నాకటంచుఁ
జాలవచియించు వీనిమీసముల రెంటి
వేనితోఁ బోల్చెడిదొయుండు వానిలోన. 188

ఇంకనీతఁడు కవిరాజునేమొ యెంచి
యతనితోడను చెలిలాట మాడెనంట
అమ్మహాకవి తన గురువగును గాదె?
యీగురుద్రోహి నొంచువాఁడెవఁడు లేడ? 189

ఇరువదివ శతాబ్దమునందు నిట్లనేను
రాజ్యమేలుట కనరె? దుర్మదులు వీగ
లేనుగలుగంగ నాభయ మింతలేక
సాధుజనముల బాధించు సాహసంబ? 190

సాధువులగు సత్కవులకు
బాధలు గావించుఖలుల బలిఁగొనని యమా
త్యాధము నాయు స్సర్గ
శ్రీధనములు వీటిఁబోవుఁ జెప్పఁగనేలా? 191

దుష్టకవి నిగ్రహంబును
శిష్టానుగ్రహము బూని జేయ సమర్థుం
స్రష్టవిధించె బురాణ
ద్రష్టలు సెప్పుదురు పరమ ధర్మముకంటే! 192

చెప్పఁదగు మంత్రులెల్లరు చెల్లిపోవ
శాస్త్రిపుంగవు లేల మీసముల దువ్వ?
ఏనుఁగులు కాలవశమున నెత్తువడిన
దొబ్బకుందునె చెలరేగి దోమగుంపు? 193

పూర్వమంత్రులు మట్టిని బోయిరనుట
పట్టిబూటకమిదె నన్నుఁబట్టి కనుఁడు!
వారునాలోన మెదలుచున్నారు నేఁడు
పోతబోసిన వారల మూర్తినేను! 194

జగతినింకను సామాన్యజనులు గూడ
రాదటందురు కవిత్వంబు వైదికులకు
నేటికో! యింత నిరసన మేనెఱుంగ?
వైదికులనంగ నెంతనిర్భాగ్యులౌర! 195

అట్లువీరల జనలోక మాడుగాక!
వారిలో నేననేకుల గౌరవింతు
వేదులయు, రాయప్రోలును, విశ్వనాథ,
మాదు దేవులపల్లియు, మఱియుఁగలరు. 196

అరయనీబోంట్లు వైదికులయిన నేమి?
ఏను నాధర్మమును నిర్వహింతు సరిగ
నిట్లుగాకుండ చేసనన్య మెంతు నేని
యెవఁడు ననుమెచ్చుకొనును? నాదేటికీర్తి? 197

వీరి గ్రంథంబులనుబట్టి పిండునపుడు
రసమునకుమించి పిప్పియే యొసఁగదేల?
నన్నుఁబోలెఁ గవిత్వమందఱును వ్రాయ
దిట్టలౌదురె? వారువైదికులు కారె? 198

"చెన్నగు నియోగి కవనవు
మిన్నా! వైదికునకబ్బి మించునె? చెపుడా!
వెన్నమిసి జున్ను కబ్బునె?
తన్నుక జచ్చినను గాని ధర నెచ్చోటన్?" 199

ఎపుడో నావ్రాయు గ్రంథంబు లింతకిపుడు
నమ్ముకొనుచుందు రెందఱో యచ్చువేసి
ఒకటఁ గనుఁగొంట వారు వైదికులెకాని
బ్రతికెదరు గాక! హాయినావలనఁ జేసి. 200

ఇవియె కాకుండ మఱియు రచించితనఁగ
విశ్వమునఁ గొందఱవ్వాని వెదకుచుందు
రింతకునుమించి నాకైత కేమివలయు?
మాయురే! యెంతయున్నది మాత్రిప్రతిభ? 201

ఇలను నేఁటిట్టు లోకట ముంచెత్తునూడ
నడుమ పానకమందలి పుడకఁబోలె
నదిగో! వేటూరివారేమొ యనఁగవచ్చి
రాలకింపుడు దానినో యనఘులార!

"చందనశాఖి కన్న విర
సంబగు బూరుగు మేలటన్న రీ
తిందగి నట్లు వైదిక క
విత్వ సుధారస ధారలెల్లఁ జె
ల్వొందగ భూతలంబున ని
యోగి కవిత్వముతోడ సాటి రా
దందురు బెట్టిదంబగు న
టందురు కొందఱు మూఢమానవుల్ !"

వైదిక కవిత్వమటయది బాగటంట
విరసమంట నియోగి కవిత్వమంటె!
"పొమ్మ! నీమొగ" మనువారు మూఢులంట
వింటిరే! ఆంధ్రులార! యీవింత మాట? 204

ఆగుఁడాఁగుడు మీరేమియనకుఁ డతని
శాంతిజెందుఁడు నామాట సదయులార!
పాపమది చూడఁగాఁ జాటుపద్యమంట
మఱిపఠింప నదేడనో దొరకెనంట. 205

అప్పుడావంట యింటనే యట్లదాఁచ
కింక దేవచ్చునే? దీని నితఁడటన్న!
అంకబట్టెడి పాకంబులనియె యేమొ
ఈసుధారస ధారల నెంచినాఁడు! 206

వ్రాసెనఁటదీని నల్లమరాజు వాఁడు
వానికినిమించి కలఁడెందు పచ్చిదొంగ?
అతఁడు భద్రాపరిణయంబు నపహరించి
పెద్దనకుమారు తనదన్న ముద్దుకాఁడె? 207

భారముగ నున్నదీ 'ముద్దు' పదమటన్న
నద్దిచందన శాఖదే యరసికొనుఁడు
రోసమునవారు మమ్ము బూరుగులనంగ
నింతమాత్రము వలదె నాకెత్తిపొడువ! 208

ఏనును విమర్శకుఁడనని యేమొవచ్చి
ఇంక వేటూరివారు నాకేమిచెప్పఁ?
బాపమయ్యది తనప్రభావంబె గాక!
వ్రాయునేదాని నల్లమరాజు వాఁడు? 209

వ్రాసెనే యనుకొంద మాపద్యమతఁడు
విలువ యేపాటిదానికో విబుధులార!
కాకి నాట్యంబుఁ జేసిన కేకియగునె?
అద్దిమున్నాళ్ళ ముచ్చటయగునె గాక! 210

వైదికులు ఛాందసులనంగఁ బరఁగుచుండి
యింతవ్రాయుటకే నేను సంతసింతు
నసలె లేకుండఁబోయెడి నత్తకన్న
గ్రుడ్డియత్తయె మేల్ కాదె కొంతవఱకు? 211
ఉబుసుపోకకు వైదికులుర్వి నేఁడు
మమ్ము నిరసించి వారె యమాత్యులాడు
రెక్కడేదిక్కు లేక పోయినవి కేమి?
మఱిదలమ్మకుఁ దనయక్క మగఁడెదిక్కు! 212
లేద! యింకొక్కమాటకు వైదికుండు
తనతనూజ నియోగికి ధారఁబోయు
మాకు వారికిఁ గలుగు సంబంధమనఁగ
నేముగూడ నమాత్యులమే యనంగ. 213
అంతమాత్రకు జనలోక మక్కటకట!
వారల కవిత్వమట్లాడ వచ్చునేమి?
మాలిమీసాలు పోయినఁ బోవుగాక
లేదొకో! పద్యమందున వైదికులకు? 214
కొందఱీసన్నె పోపొమ్మటందురనిన
నింకనే వైదికుల నెవ్వఁడేమిడిట్ల?
ముఖ్యముగనున్న తలకాయ పోయినపుడు
చెవులపోగుల నింకవచింప నేల? 215

అందు శేషాద్రిరమణులం చనెడు కవ్రుల
నడుగుచో నోకిలింతలా ననుఁడు సభ్యు
లోగుశేకుండ నెందున బాగుకలదు?
కష్టమెఱుఁగక నెవఁడు సుఖంబునేచ్చు? 216

ఇంక శ్రీనాథునకు సీసమే రచింప
రాదటంచను మఱియొక్క వైదికుండు
ఏమిచెప్పంగ వచ్చును నితనిగూర్చి?
అందఱొక్కటి మఱిమహాత్ముఁ డొకటి. 217

ఇంత కీయాంధ్రభాషనే నేలుచుండ
నిందు నీవిశ్వనాథ రానేల? చెపుడ!
మా యమాత్యులయెడ నభిప్రాయ మొసఁగ
నితని యధికారమెయ్యది? యితఁ డెవండు? 218

వినుఁడు! ననసోటికొన్నిరా పెసలనంగ
సోలె డామీఁద మఱియుఱ సోలెడంట
తలఁపుఁ డట్లనె యొట్టపుదాని గుడిసె
యూరి కావల నెచటనో యుండునంట. 219

అంతటి యవామకుండితఁ డదుపు లేక
తగుదునని రాఁబనేమి నాస్థానమందు?
కంటె! యాంధ్రకవీంద్ర నతుతి కోటి
కీయమాత్యుండె కద! చంద్రుఁ డింతకెపుడు! 220

అందునకు నేను గానేని యాంధ్రలోక
మేక కంఠంబుతోడఁ దానేల యేద్వ
దేన పాలించు కోర్కె నాకేమి లేదు
పోదు నాబిడ్డతోడను భూమి గలిసి. 221

ఆంధ్రభారతి యాతటి యాస్య మేను
మఱచి సుఖముండ నెన్ని జన్మములకైనఁ
బుట్ట నేటికి నాకామె పుత్రిఁజుగుచుఁ?
గాను నేనేమిటికి గొడ్డుహాని గాఁగ? 222

అద్ది యేడాదికిని లేని యపుడె యయయొ!
జాషువ కవీంద్రుఁ జేతికొసంగి నాఁడ
నేమిదోషంబు పట్టెనో యేమొ తెలియ
నరిగె మొన్నటికే పదునాఱు నెలలు. 223

ఆంధ్రభారతి! వసురాణి యనెడి పేర
నాకు జన్మించి యపుడె ప్రాణములవిడుతె?
ఏను నీపటమేల దీయింప నైతి?
నంత యందము మన్నానె యరయ రాక? 224

అవని నినుఁబూడ్చునట్టి మూఁడపదినంబు
తెచ్చితే నన్నమును నీవు దినెడికొఱకు
దాని నాముందు కాకిగ్రద్దలు హరించె
నేను పుట్టంధునిగ నేలగాను? తల్లి! 225

ఈవు మరణించు మీఁదట నేమిచెప్ప?
నెఱిఁగెదవుగాదె నీకు సోదరుఁడు నుంట?
నీళ్లవాఁడును నెనిమిది నెలలు పెరిగి
నాకు మీయాయుఃవుల నేమనంగవచ్చు? 226

కన్నుమూసితి నీ "వోరుగల్లు" వేల
నాఁడు "కూనూరు" భూమిగర్భంబు జొచ్చెఁ
గంటె! యొకతల్లి బిడ్డలేయఁట మీర
లేలవచ్చెనో యీదూరమే నెఱుంగ? 227

వానికోసము నాకేమి భయము లేదు
కంటె! నాతండ్రి వానిదగ్గఱగ నుండు
నేను నిన్నించికొనియె చింతించువాఁడ
"నెవరు నాతల్లి చెంతలేరే?" యటంచు. 228

ఎవ్వఁ డాతఁడు వెనుదట్టి హెచ్చరించుఁ?
బోతసయు? యిట శత్రుసమూహమున్న?
అరరె! నాబుద్ధిమాంద్య మేమనఁగవచ్చు?
నెవ్వరేనియు నాయేడ్పు నవ్వరుకద? 229

ఏన యావేశమున నేమి యెఱుఁగలేక
నాతనూజను గరకర నమలినాను
సంతసింపఁగ వలవదో శత్రులార!
ఎల్లిరానున్న మీచావు లెఱిఁగికొనుఁడు? 230

పుట్టిన బిడ్డ గతింపఁగఁ
బుట్టెడు దుఃఖమున నేను మునిఁగిన నకటా!
కొట్టెదరె! మీరు చప్పట
లుట్టిని గట్టుకొని యెవ్వఁ డూఁగును? చెపుడా! 231

ఇంతకుఁ గనంగ నాపిల్లమృతియె కదర!
చేలవలె నన్ను నీడ నేడ్పించినద్ది!
పూడ్చివైతున? దానిని భూమియందు!
యింత యవమాన మెట్లు సహింతు నేను? 232

అరరె! యది ప్రాణముల విడనాడు మీఁద
భూమియందున నే కాదె పూడ్వఁబడియె?
నెంత వగుబాటు! హా! నేఁడి దేమి మాయ?
మాటి మాటికి నాకవమాన మేన? 233

ఏది! భారతీ! అదినాకు కాదు తనయ
కాకి గ్రద్దల కిడెద ముక్కలుగఁగోసి
అంతటి నియోగి బిడ్డనైనట్టి నాకె?
గోటి చుట్టున రోఁకటి పోటులిట్లు! 234

అరరె! యింతకు సృష్టి రహస్యమరయఁ
బ్రాణి కోటికిఁజావు తప్పనిదె కాదె?
యింక నాయమ నిందునే నేమి తిట్ట?
దాని కేడ్చుట నాయదే తప్పుగాక! 235

ఇంక నన్నిందు మీరెవ్వరేమి యనకుఁ
డేను నాతల్లి విడవాడి యేడికేఁగ
నింక నన్నిందు భగవంతుఁ డెదిరికొనని
తన్నిపై చెద నాయది కన్నప్రేమ. 236

అరయ నేదోషమో తన నంటికొనఁగ
నాంధ్రభారతి యటుమాయ మానుగాక!
ఆమె యాదము నేను నాయందుఁ జూడఁ
జావు లేకుండ బ్రతికెద శాశ్వతముగ. 237

అనఁగఁ దెలుఁగుకవిత యందమొక్క నియోగి
యందె నిండియున్న దన్నమాట
ఉన్నమాట కింక నొదిగి యుండఁగనేల?
నిదిగొ! చూడుఁ డిప్పుడేన కలను. 238

ఏమి? యభినవ తిక్కనా! యేమంటాదు?
చేరి తేనీవు జెళపిళ్ళ శిష్యులందు?
తఱిఁగిపోవకఁ దెలుఁగుఁ గైతలపసందు?
కులుకుచున్నదె చెళపిళ్ళ కలమునందు? 239

నీవు నాతోడ వాదాన నిలుతువేని
వ్రాసికొనిరమ్ము మఱి కవిబ్రహ్మ బిరుద
మీవు నాచెళ్ళపిళ్ళకుఁ బోవునవ్వా
డింకఁ దిక్కన్న వెట్లు? నిన్నేమనందు? 240

తెలియవో! యింత కిలఁగల్గు తెలుఁగుకవులఁ
దిక్కనామాత్యుఁ డొక్కఁడే మొక్కలియని?
అతని నామంబు గొనుచు నేఁ డితనికోడి
మంటఁ గలుపుదువే! మా యమాత్యకోటి? 241

ఇంతకునుగాని యిప్పుడీ వేళకొంటి
వంతటి మహాకవీంద్రు పేరడుపు లేక?
నవ్వుచున్నారు చూడుము! నలువురవలఁ
బటపట ధ్వనినట్టి చప్పటలఁ గొట్టి. 242

కొంటివే యనుకొందవు కోర్కెయుంట
నేలచెప్పవు నాతోడ నింతఁగూడ?
వీఁడు నీయాజ్ఞ నీచెళ్ళపిళ్ళ నేమి?
పట్టి మ్రింగఁడే? యంతటి బ్రహ్మనొకట! 243

నావచించుట నవ్వుచున్నావె? యనఘ!
నేను నీయాకఁ బోలుదునే? నిజాన
మాపుకోలేని జాత్యభిమాన ముండి
యేను నొకమంత్రిగానేమొ యేడ్తుఁగాక! 244

తెలిసితిపుడు స్వామి! తేటతెల్లంబుగ
నీదు వ్రాతలోని నిక్కువంబు;
చెళ్ళపిళ్ల కట్లు జేజేలు పెట్టుట
హి!హి!హి! యనుచు నగుట యింతేకాదె? 2 5

తిక్కనార్యుఁ డన్న నెక్కడి మొనగాఁడు
మంత్రికోటి కతఁడె మణిగదయ్య?
అట్టినీవు నన్నుఁ బట్టి పరీక్షింప
నిలువఁగలనె? నేను నేనుగాన? 246

అయిన నొకమాట తిక్కనా! యవధరింపు
విన్నపము జేసికొందుఁ గోపింపవలదు
"నన్నుచంపి పుట్టి" తనుఁ బోతన్న యేమొ!
యింక నన్నట్లు మీరన్న నేమికలదు? 247

ఏను నిన్నేమి యంటినం చేటికడిగ
దీవెలుంగని దొకటి యున్నె? మహాత్మ!
వెనుక పొగఁబెట్టెనంట పొమ్మనక నొకఁడు
నాకు మీమాట యట్లెయున్నది కనంగ. 248

అన్నమాట యేమొ యదిముందు చెప్పక
నేల దానికింత యేడ్తువనుచు
ననెదరయిన మీర లదినేను చెప్పిన
దిద్దికొందొ? ముందు దెలుపుడద్ది! 249

చెప్పితినె పొందు దానిని సిగ్గుమాలి
మీఁద నవ్వేగెమీరు సామెతలఁ దెచ్చి?
చెప్పనేటికి? నేనెంత చెడిననేమి?
ఓప నవమానమింత నియోగినాడు! 250

పొరుగువారు నన్నుఁ బొపొమ్మనిన నింటి
వాఁడ వీవు దీయవలదె చెంత!
కీవు నన్నుఁగొట్ట నింకెందుఁ బోదును?
కంచెచేను మేయఁ గలదె దిక్కు? 251

ఇంత కా"సూరి"నే కాదె! యెల్లినేను
భళిభళీ! యనిపింపఁగఁ బంతగింతు?
వ్రాయుదేమింక నేను? నాపాడె యేమొ!
పడితినే? తొట్టియందున బల్లిఁబోలె! 252

నేను నీకెందునను బోలనేరకున్న
బాగుగాఁ జూచి మతిచెప్ప వ్రాయలేనె?
కడకు తిరుపతివేంకట కవులమించి
ఉప్పునకుఁ బోవు వారి శిష్యులనమించి. 253

చూడు! గడ్డముపట్టి నేవేఁడుకొనెద
వినుచవే యింక నేననీ పెద్దనోట!
జగతి లేదనిపించు నా శైలినేర్చి
తరమె వారల కీకవిత్వంబు వ్రాయ? 254

ఈవు నామాట యాథార్థ్యమెఱిఁగి యెఱిఁగి
హీనముగ వారితోడ సమానమనకు
మదిర! నాకైత యందమేమనఁగవచ్చు?
ముట్టుకొన్నంతనే మాసిపోవుఁ గాదె? 255

కన్నులెఱ్ఱజేసి కలమువాయది చూడ
మాడిపోవె శివుని మూఁడుకండ్లు?
వారు నేను జెప్ప నయముకాదందువా?
తెలుపుమయిన నీవె తిక్కనార్య! 256

అంతమాత్రకు నన్నుఁ గాదందువేని
నేనొక నియోగినంచు నింకేల బ్రతుక?
నీకుఁగల కీర్తి నట్లనే నిలుపుపొంచు
అంతకును మేలెకాదె? నాకాత్మహత్య! 257

ఏనుపోయిన మాజాతి కేమికొఱఁత?
చాలు నొకటిద్దఱే నిన్నుఁ బోలువారు
పుట్టు దినమందె నేనేల గిట్టనైతి?
దుర్ఘటము! దుస్సహాము! మఱి దుర్భరంబు! 258

వింటినన్నివాక వేయియేండ్లక్రిత మీ
విశ్వంబు నందుంట నేఁ
గంటి న్నాహృదయంబునందు మఱి నీ
కల్యాణ రూపం బిదే
కంటిం గ్రమ్మఱి నీ సభాంతరమునం
గండ్లార నాకింక నే
వెంటంగాని యనుజ్ఞనీవె! కలుతు
న్వేవేగ మాపోతనన్. 259

తిక్కనా! మోమునిట్లేలఁ ద్రిప్పికొనెద
వదినా! కన్నీరదేల గార్చెదు? మహాత్మ!
కాల్పనే? కత్తినాచేతి కలము ముందు!
కనవె! నాగుండె నెటుగ్రుచ్చుకొనుదో దీని! 260

ఆపకుము నన్నుఁ దిక్కనార్యా! క్షమింపు
మిందుమాత్రము నిన్నుఁ గాదందు నేను
చెప్పరాకుము నాకీ విచిత్రములను
కయ్యమున నన్నుఁ బిలచు మగండెవండు? 261

ఆతఁ డీమీనముల వార్త నందియోన!
యాఱుడలు దాటివచ్చి నాడాలమునకు?
"నాగురుం డీతనికిఁ దీసినాఁ డదెట్లు?
సూర్యచంద్రుల చలనంబు జూతు"ననుచు. 262

సత్యమిదియేని నేనిష్ఠ జచ్చిపోవ
నింకఁ దెలుపుము! వాఁడెవ్వఁ డెంతవీరుఁ
డందున గుఱించి యవ్వాఁడె యాడు నేమి?
అయినఁ దడవేల? వేగరమ్మనుము వాని! 263

ఏడి? వాఁడేడి? నేనింక నెదిరికొందు
నెదిరికొని యింక నింగికి నెత్తివైతు
నెత్తివైచుదు వాడింక నిలను లేడు
నాశయంబింక నెన్నఁడు మాయవలదు. 264

“తిరుపతి వేంకటేశ కవి
ధీరుల శిష్యుఁడ, నాదుపేరు “వే
లురి శివరామశాస్త్రి” యని
లోకము వాకొను, నాఢ్యమైన వ్యా
కరణము జీవనంబు, నధి
కారము కావ్యపురాణ నాటకా
కరములఁ, జేయఁ జాలుదున
ఖండము వాఁగ శతావధానముల్” 265

అదిర! నాభాగ్యమద్ది యేమనఁగవచ్చు?
పేఁడికద! తొల్లికొప్రంపు వీరవరుల
నెదిరి యిట్లనె గర్వంబు నెసఁగినాఁడు?
చూచెదనుగాక! యింక నీశూరవరుని. 266

“బాలుం డీతఁడు! శైలమాతఁడు! మహా
భారంబు సైరింపఁ గాఁ
జాలండో” యనుభీతి నాకు నెవరుల్
సాయంబుగా రాకుఁడీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరా
చక్రంబుపైఁ బడ్డనా
కేలల్లాడదు సభ్యులార! నిలుఁ డా
క్రీడం బ్రమోదంబునన్. 267

ఏమయా! నాకు నీగురు వింతయయిన
సూర్యచంద్రుల చలనంబు జూడరాద?
ఈకవిత్వంబు నెవ్వాని కెఱుఁగఁ జెపుదు?
వింక నీతోక నెవ్వాని కేర్పరింతు? 268
అరరె! నీగురు వోడంగ నట్లయయిన
నేనుబోయిన మొదట నీవెట్లు బ్రతుకు
దాంధ్ర భాషార్ణవంబు నాయలుకఁ గనిన
నెండిపోవదె! యట్టె యిట్టింకులింకి? 269
చూడఁ జెళపిళ్ళ కీవు శిష్యుండవయిన
నేను పోతన్న శిష్యుఁడ నింక నేమి?
నీగురున కెట్లు పోవునో నాగురుండు?
రావె! "సలసల" మనెడి నారక్తమిపుడు! 270
లేదంచు నొకమాఱు ♦ వాదింప లేతునా?
వ్యాకరణం బంత ♦ యంతరించుఁ
గాదంచు నొకమాఱు ♦ కలము జేకొందునా?
కావ్యంబు లన్నియు ♦ గాలికెగురుఁ
గోపించి యొకమాఱు ♦ కుప్పింతునా? పురా
ణములన్ని యట్టుల ♦ నలిగిపోవు
నాడించి యొకమాఱు ♦ నాడింతునా? తల
న్నాటకంబులు నన్ని ♦ యేటఁగలియు

నారఁజేసెద నీయధికార మింకఁ
దన్నివై చెద నీయవధాన మింక
మంటఁ గలిపెద నీయహంభావ మింకఁ
బిక్కి కాకులకిడెద నీశ్లోక నింక. 271

నాప్రయోగము లేక ♦ నాయొంగిలికి రాక
నేవ్యాకరణ మంత ♦ యేడ్చితోయి!
నాకూర్పు హాసియించి ♦ నా నేర్పునకు మించి
యేకావ్యమును వ్రాసి ♦ యెసఁగితోయి!
నాబలంబును కేటి ♦ నాప్రతిజ్ఞను మీటి
యే పురాణంబున ♦ కోపితోయి!
నాకలంబును దట్టి ♦ నాకవిత్వము గొట్టి
యేనాటకంబు ర ♦ చించితోయి!

ఇంక నీకున్న నధికార మేటికోయి!
ఇంక నీసేయు నవధాన మేటికోయి!
ఇంక నీగర్వ మారయ నేటికోయి!
ఇంక నీశ్లోకఁ జూపఁగ నేటికోయి! 272

మేక గాంభీర్యమున గురుమించి పోయి
పెద్ద కపివై తిగాక నీపీకు డెంత?
వదయా? నీమహాగ్రంథ మేదొ తెమ్ము!
క్రింద సేతువె? నన్నుఁబెగ్గలను గొట్టి! 273

గురువుగారిని దక్కించుకొనెడి పొంచు
తగుదునని వచ్చినాడవే! దండిశిష్య!
నీగురువు నిన్న నింకనీ నిఖిలజగతి
నాదివైవక నేనమాత్యుండ నెట్లు? 274

కొమ్మల కోడవైన యెడఁ
గోపము దీఱఁగవచ్చు కుమ్మక
య్యమ్మన వాకలంబు పస
నార్పుము చూచెదగాక! చచ్చుట
మ్మమ్మను బోలె నుత్తర కు
మారుని ప్రజ్ఞలనేమొ యాడునే
మమ్మది యేమి? సిగ్గు! యథ
మాధముఁ డాదురు నీతికోవిదుల్. 275

నాకు పాండిత్య మింతయు లేకయున్న
దాని తలఁదన్నెడిని కవిత్వంబు కలదు
పోను నేనిందు బ్రహ్మదేవునకుఁ గూడ
సత్యము వచింతు నిది సహజంబువినుము! 276

కాలి చల్లారు కొప్రంపు కవులచితులు
మఱల నీనాఁడు నాలోన మండుచున్న
వేనెఱుంగను గద! దీని కేమి కతమొ!
ఇంక నాచితిమెవని దహించు నేమొ! 277

అరరే! గర్వించి యింక నేమాటివయ్యా!
ఘంటికల నూడఁగొట్టుదే! గెంటివైతే!
వెంట్రుక నొకందు ముందట పీకలేవు!
ఘంటికల నూడఁగొట్టును గెంటుదెట్లు! 278

ఓహొంహొం! నన్నీవు గెంటివేయుట యటన్న
నాంధ్రజాతిని గెంటివేయంగ గాదొ!
నేటి కీనన్ను తన ప్రతినిధిని జేసి
యవల గెంటఁగ బడునటే? యాంధ్రజాతి! 279

ఆంధ్రజాతి యదేమొకో యట్లపోని!
తెలియ లేదేమి! నీవ చూత్ర్యల గుఱించి!
ఇప్పటికి మించిపోయిన దేమి లేదు
మంటకలువదు కలదోయి! మంత్రికులము! 280

కవిత వ్రాయంగ నుందుము కలముదీసి
కదనమొనరింప నిలుతుము కత్తిదూసి
యవనిఁగల జాతులందు నేదైనఁ గాని
వచ్చి పడుఁగాక! చెప్పరే! పందెమేమొ! 281

తలచితిన యేని మామకాంధ్రంబు నుండి
నేను నన్నయఁబట్టి గెంటెదను గాక!
అట్ల యొక్కింత యిందునన్నవలఁ ద్రోయ
వశమటే నిన్నుఁ బుట్టించు బ్రహ్మకైన! 282

అంత పన్నివు కాదు నేనెంతవాఁడ?
గెంటెద నటంచు నింత కీవంటిగాదె?
పుడమి నీవొక్క తండ్రికిఁ బుట్టుదేని
ఇంక గెంటుము! జూతు నీబింక మేను! 283

ఓయి! శివరామశాస్త్రి! నీవొకఁడ గాదు
రాసి నీజాతియంత వైరంబు బూని
ఒక్కఁడవె దాని నీభూమిఁ ద్రొక్కుకున్న
నేను నాతండ్రి కింక జన్మింపలేదు! 284

మీరె యొకనికిఁ బుట్టినవారు కాని
పృథ్వి నేయాంధ్రులట్టుల నేడ్వలేదొ?
మానహీనలె యందు మామాత లెల్ల!
నేమి గానెంచితివి మమ్ము నీమనాన? 285

పట్టనా? కత్తిసి ♦ పౌరుష మ్మెగ జిమ్మఁ
దోయధులేదునె ♦ త్తుటులఁదేలు
నొక్కుదునా? కల ♦ మ్మొక్కమాటునఁ దీసి
మక్కంటి శూలమ్ము ♦ మొక్కవోవఁ
బోతునా? కుప్పగ ♦ బుద్ధి బలంబును
బ్రహ్మ తేజంబుది ♦ వాలఁ దీయుఁ
దలఁతున్నా? మతిలోన ♦ దాతృత్వ మెుక్కింత
తరలును బలియుఁ బా ♦ తాళమునకు.

ఖడ్గ తీక్ష్ణన తిక్కనల్ కలుగలేము
తిమ్మరుసు భాస్కరుల మాట తెలియరాదు
మామకోన్నతిఁ గూర్చి నేనేమి చెప్ప?
గలదయా! దేశమందు నాంధ్రుల చరిత్ర! 286

మంత్రులై మొనలేని ♦ మంత్రంబునం బంతు
లాడించి రంట రా ♦ జ్యములఁ బట్టి
సేనాధిపతులయి ♦ క్షితియెల్లఁ గంపింప
నడిపించి రంట సే ♦ నలను ఖదము
వీరాధివీరులై ♦ వైరికోటి నడంచి
తూలించి రంట ర ♦ క్తమునఁ గత్తి
కవిబ్రహ్మలై మఱి ♦ కవిసార్వభౌములై
కావించి రంట స ♦ త్కావ్యములను

రాజ్యతంత్రము నాంధ్రభారతియు నెపుడు
మంత్రుల యధీన మనుమాట మాయదంట
తెలిసెదరు వారు నీకెట్లు? తిండిపోత!
కాంచు మిఁక నేనిఁ గన్నులఁ గడిగికొనుచు! 287

"అఖిల రాజాధిరా ♦ జస్థాన జనహృద్య
విద్యావిహారు లా ♦ ర్వేలవారు
కల్పక బలికర్ణ ♦ కలశార్ణ వోదీర్ణ
వితరణోదారు లా ♦ ర్వేలవారు

సజ్జనస్తవనీయు ♦ సతత నిర్వ్యాజహా
రిపరోపకారు లా ♦ శ్వేలవారు
ఘనదుర్ఘట స్వాము ♦ కార్యనిర్వహణ ప్ర
వీణతాధారు లా ♦ శ్వేలవారు
విమత గర్వాపహారులా శ్వేలవారు”
విశ్వమును మ్రింగువారలా శ్వేలవారు
విలువ కందనివారలా శ్వేలవారు
వినుతి కెక్కినవారలా శ్వేలవారు. 288

ఆంధ్రుల యదృష్టమును గొంత యూపలేదన్న
యిప్పు డీరీతి విశ్రాంతి నేడ్తుగాక!
అంతకే నేను నినుబలె ననదనైతె?
నాఁటి నెత్తురు లేదె! నానాడులందు! 289

ఇప్పటికి నేను మీబోంట్ల నెంతు నేని
నింక నీదేశ మొక్కటఁ నేమిసేయు?
నాంధ్రులకు మోదమొసఁగ ముందభయమిడుట
నట్టి తలఁపును మఱి తలపెట్టఁగాక? 290

అక్కటా! నాకు నింక నీయాశ లేల?
ఆవిధాతను నేనెంత యాడిపోతుఁ?
బట్టుమని నాకు నింతటి ప్రజ్ఞనిచ్చి
పారవేయునె! మిన్నులు పడ్డచోట? 291

నన్నుఁ బోలెడి జాతి రత్నంబులెన్ని
పుట్టుచోటనె నశియించి పోయినవియొ!
వచ్చుగాక స్వాతంత్ర్యము భారతమున
రాదుపో! యాంధ్రజాతికి రాష్ట్రమెపుడు. 292

ఏను నట్లనె నశియింప నిష్టపడకఁ
జేయిఁ జాచెద నను మంత్రి జేయుకొఱకు
పైకొనుచు వేగరండు నృపాలు లెవరో!
భాగ్యవంతుండు మున్ముందు వచ్చువాఁడు! 293

శంతమున నింకఁ జెప్పెదవ్వాని నేను
భరత ఖండంబునకుఁ జేతుఁ బట్టభద్రు
వా నృపాలు కిరీటము నానిసేన
జొర! యన నొప్పెదను "కోహెనూరు" నవ్వి. 294

ఎంత యెలుఁగెత్తి యేఁమినే నీయెడారి?
నోపి యెవ్వాఁడు దీర్చును నాపిపాస?
"మంత్రి" యనఁ బుట్టితసియె సంబరమునంది
యందగించెద గాక! నా యాంధ్రభాష. 295

వదలితేమింక నీవు కొప్రంపు కవుల?
వారలు శతావధానంబు బల్లెలందుఁ
బామరుల ముందుఁ జేసియే వఱలిరేమి!
అయిన మీమాట వినిపింపు మదుగుదేను! 296

పండితులు మండకని పోని పల్లెలందుఁ
బామరులు మచ్చునకు లేరె పట్టణముల?
ఘనుఁడ వగుదేనిఁ దలవంచికొనక చెప్పు
మేలవచ్చితి విందు? నీదేటి బ్రతుకు? 297

ఇంత కీవేళ్ళ పండితు లెంతవారు?
తిక్కనల? పోతనల? యేలఁ దెలుపవయ్య!
అవని నీనాఁడు పండితు లెవరు కారు?
చెప్పు నీవె "విద్వత్కవిసింహ" మగుదె? 298

ఆమహా పండితమ్మన్యు లందఱొకట
వారి నిరసించి మిమ్మొంచినారె యనుము!
చెప్పుమంతకె మీ రేల శిరము లెత్తఁ?
దెలుపుమంతకె వారేలఁ దలలు వంప? 299

కంటె! కుక్కలఁబోలె నొక్కటిగ మొఱఁగి
మీర లవ్వారలను మీఱినారె గాక!
వారివారల నెందఱు లేరుమగలు?
వారిముందట మీరు మీవార లెంత? 300

ఇంక మీయధికారంబు లేల నేఁడు
రిల్లె యురిఁ బెట్టికొనియైన యేలఁజావ
రెట్లు తలయెత్తి దిరుగుదు రితరులందు?
నెవరు నవ్విన నేమి మీకేటి సిగ్గు? 301

అరుగ నేటి కమాత్యుల యింతవఱకు?
చౌదరి కలంబెయున్నది జాడ్యకలఁడు
వీరి ముందటనే మీాకవిత్వ మెంత?
ఇంక నవధానముల మాట యేటికంత? 302

నీకు మాగురువులు మెచ్చినారె యనిన
మెత్తునేనును దిక్కనమించి మొదట
నంతకే మీారు తిక్కన్నలగుదు రొక్కొ?
చెప్ప నేటికి మెప్పులె గొప్పగాక! 303

వారి నఱుకుచు బోవంగ వలవదయ్య!
కంటె! నాభామ ముందునఁ గలరు స్త్రీలె!
నాగిలో మొల్లయను నామెఁ బేరుకొనెద
నామె ముందటనే యెంత మీా మొగాలు? 304

దీననేకాదె? వెనుక మీాదేశికుండు
వ్రాయలేదనె నామె రామాయణంబుఁ
గడకు నొకయాఁడుదానికిఁ గానివారు;
చెప్పనింకేల? మీాగలు గొప్పవారు 305

ఇప్పుడెవ్వారు నన్ను నీవెంతయనుట
భారతీదేవి నెదిరించినారె కదర!
తలఁప నామెకు నాకు భేదంబుకలద?
ఆమెనే నేనుగాక! నేనామెఁ గాక! 306

ఇంక నామాట సత్యంబు నెఱుఁగుదేని
నాంధ్ర భాషార్ణవంబు లోఁ గొనసిరమ్ము!
కారణము నేనకద! యీయగాధమునకు?
చను లేకుండఁ జెప్ప మందేమికలదు? 307

ఇంకఁ గొప్రంపు కవులు నీ వెదుటలేక
"వదరి రోకపద్య" మన్న ప్రవాదముండు
నేమి సేతువో నీవప్పు డెదుటనేడ్చి?
చేయుమింక దాని నీముందు జెప్పదేను. 308

ఆశలడంగి మీగురువు
లంతటి వారెదిరింప లేక నా
వేశము దక్కియుండిరిఁకఁ
బీకుమగండ నటంచు నేటికి
యాశుకవీంద్ర సింహమున
కాగ్రహముం గలిగించి చత్తువ
వ్వా! శివరామశాస్త్రి! యిది
యాంధ్ర కవిత్వము! నేనమాత్యుఁడన్.

ఆంధ్రభాష యనిన నరయలేదేమొకో!
యది నియోగిపలన యులరునంట
ఇల నియోగియనిన నెఱుఁగలేదేమొకో
ఆంధ్రభాష యనఁగ నతఁడెయంట. 310

వినుచు మందువ? యూనుకవి త్వ మింక
నింతఁ బదునైదు సర్వంబు లెనఁగునందు
సన్మనంమవ! యేదయూ' నాకుఁబోలెఁ
బర్వ మొకటియె చాలును నా(సి తెమ్ము! 311

ఇంతవఱదాక నేమొ గర్వింతుగాదె?
భీతి నిపు డేటికి మ్మెయి వెనుకదీయ!
కంటె! యిదియేన నీ మొనగానితనము?
బ్రతికి ఫలమేము యూ! శివరామశాస్త్రి! 312

నాఁడు కొవరింపు కవుల నీవాడినట్టి
కాఋకూతలు విబుధ లోక మ్మెఱుంగు
వారివాఁడను నేను నాబారిఁ జిక్కి
యనుభవింపక నింక నెందరుగునోయి! 313

ఇప్పు డేము నమాత్యుల మేయటంచు
నన్నుఁ జూతురె సౌందర నందక ర్త
లిస్సిరో! వీరికింత సిగ్గేలలేదు?
కలదె! ముగమింకఁ దమకు మంతు లిమనంగ! 314

వీ రమాత్యులు కదయని గౌరవింప
నేమి కలదింక నెత్తికె మెక్కినార
లింతటి కవిత్వ మింతకు నెవరువ్రాయ
కీ మహాపిల్ల కవి కద్ది యేమిలెక్క? 315

పట్టఁ బోకుఁడు నాకవిత్వమునఁ దప్పు
నాప్రయోగంబె వ్యాకరణంబు పలుచుఁ
దప్పులేమైనఁ గానుఁడు సూత్రింబులట్లు
యిద్ది నాయాజ్ఞ! యెవఁడు నోరెత్తువాఁడు? 316
పనిగనే తెంచి యింకఁ గొంప్రంపు కవులఁ
"ద్రిపురనేని"యు నేమేమొ పేరిలెనంట
కంటె వీఁడును కవిరాజెయంట నేటి
కేమి చెప్పఁగవచ్చు? నాసామిరంగ! 317
పట్టి వచియింప నోకఁడు "శ్రీపాద" గాక!
ఏనెఱుంగని కవిరాజు లెవ్వరొక్కొ.!
ఇట్లజూచిన కవిరాజు లెవరుకారు?
కుక్కగూడను కవిరాజె నిక్కముగను. 318

శతఘంట కవనంబు ♦ సల్పుదు మన్నమా
శక్తి యడంపఁదాఁ ♦ జాలునంట
అష్టావధానంబు ♦ నాచరింతు మనమా
శక్తి యడంపఁదాఁ ♦ జాలునంట
ఆశు కవిత్వంబు ♦ నాచరింతు మనమా
శక్తి యడంపఁదాఁ ♦ జాలునంట
సద్గ్రంధ రచనంబు జరుపుదు మన్నమా
శక్తి యడంపఁదాఁ ♦ జాలునంట

అరరే! వీఁడిట్ల పెగ్గెల నాడునాఁడు
పిండముగ నైన నొప్పినేనుండ నేల?
బలిమి నామాతృగర్భంబుఁ బగులఁదన్ని
వచ్చియుండును గాదె? యీవలకు నేను! 319

నేఁడు నాఁరాక వాఁడిల లేడటంచు
యెంతటి యదృష్టవంతుఁడో యేమొ తెలియ
నెట్లు గనవచ్చునాకు వాఁడింక బ్రతికి?
యెట్లు గనువాఁడనేను వాఁడింక బ్రతుక? 320

ఇట్ల యప్పుడె దా నశియించునేని
ఇంక మాశక్తి యడఁపఁగ నెట్లుజాలు?
జాలుదంచని యెట్లు దా జగడమాడెఁ?
గాలిపో వానిబూదియుఁ గలదె? నేఁడు! 321

అక్కటా! చచ్చువాని వెన్నాడి యిట్లు
వానికాటిని దీర్చెదే? పగ యనకుఁడు!
ఏను లేకుండ వీఁడు మమ్మెట్లుకాల్చె?
నెఱుఁగరే! సభ్యు లద్దాని కేదిశాంతి? 322

ఉద్భవించినది నియోగి వంశంబున
శరమునుండుఁ గలము శక్తిమించి
మంటలేచినయది మానసంబందున
శాంతమేడ నింక? సభ్యులార! 323

ఏనుజావక నెప్పుడు నిట్లయుందు
నని వచింపను మీకునో యనఘులార!
కంటె యొకగడ్డిపోచకుఁ గానివాఁడె!
ఇంత మాశక్తి యడఁపఁదా నెట్లుజాలు? 324

ఇది తలంచినకొలఁది నాకేమొ కాని
వచ్చుచున్నది కోపంబు పట్టరాక!
ఏమిసేయుదు? నపుడ వాఁడేలజచ్చెఁ?
పౌరుషంబున్న నిఁకనైన బ్రతుకఁడేల? 325

"పెఱుకుదునే ఫణీంద్రుని విష
భీషణ దంష్ట్రలు? భూమిఁ గ్రుంగఁ జే
సఱతునె? నింగిమ్రింగుదునె?
చండదిశాగజ దంతకాండము
ల్వ్రేఱుతునె? వారిధుల్ పుడిసి
లింతునె? మందర మంగుటంబునన్
జిఱుముదునే? జగంబు లఱ
చేతికిఁ దెత్తునె"? చెప్పరే? కవుల్! 326

ప్రాణములఁ బాయు వాఁడింక బ్రతుకఁడేని
లేదె భువిలోన వానికెవ్వాఁడుఁ గూడ?
నాంధ్రజాతిని మొత్తంబు నడుగుదేను
వ్రాయునే? తాను నాసరి గ్రంథమొకటి! 327

అవని నేఁజావ నన్ను రమ్మనుఁడు వైరు
లేని యవ్వాఁడనంచు రాఁడే నియోగి?
ప్రాణములఁ బాసిపోవు కోపవింపుకవులు
కనులఁ గట్టుటలేదె? సంగాంచు నపుడు? 328

వీఁడు సూతపురాణంబు పేరుతోడ
నేదొ క్షుద్రపురాణ మొకింత గిలిపి
"వనుగవిరాజు" నంచు మమ్మేఁచ నౌనె?
కాలిపోవఁడె? యీమేము కన్నుఁదెఱవ! 329

ఏటికో యేమొ మఱి "పిసుపాటి" యొకఁడు
చాల వెలిగ్రక్కినాఁడంట సంస్కృతంబుఁ
దెలుఁగుభాష నొకింతఁ దాఁ దెలియునేని
విడిచి పుత్తునె? యూరక వీనినేను! 330

కనరే! యింకను నాల్గు సంస్కృతపు ము
క్కల్ నేర్చి మీసాల మె
చ్చినవాఁడై మము నీసడించెనఁట కా
శీ కృష్ణమాచార్యుఁ డీ
ఘనుఁ డాంధ్రంబున మమ్ముబోంట్లసరి యే
గ్రంథంబు గావించెఁ? జే
రున కేనిక్ఁ వివరింపరే? కవులు! కా
ఱుల్ కూయుటం దీతనే? 331

సంస్కృత మొకింతనేర్చిన సాహసమున
వీరు వారల నెగ్గాడినారు గాక!
రామ! శ్రీరామ! శేషాద్రిరమణు లెవరు?
రారె! వీరికిఁగూడఁ గ్రొసంపు కవులు? 332

మున్న నీవేళకాదె? పోతన్నఁ గూర్చి
ముప్పు తిప్పులఁ బెట్టితి ముక్కుఁ బట్టి
మాయురే! వీరలప్పుడే మఱచిరెట్లు?
కత్తిదెబ్బల మించు నాకలముపోట్లు! 333

భళిర! యింక నియోగులు వైదికులును
గనఁగ నిర్వురు తమకు నొక్కటియయంట
భేదమేలేదు పెండకు బెల్లమునకు
నింతియేకాదె! వీరు వచించునద్ది? 334

అట్లు కాదందురేని తామన్న యట్లు
కొంతవఱ కొక్కటియయనుకొంద మిర్వు
రయినఁ జెళపిళ్ళ పక్షంబు నందగించి
పదర నేటికిమస్సు క్రొపంపు కవుల! 335

ఇంక నొక్కటి యనుమాట యేమొ తెలియ
నేడ నొక్కటిగానాదు మేము వారు?
ప్రేమ వాటించి పెండ్లికి బిలుచునపుడ?
తమరు వడ్డించెడివి భోజనముల యపుడ? 336

అబ్బురగాకిర్వు రొకటి యంచాడనౌని?
ఆంధ్రభాషా ప్రసక్తి మున్నరయుచుండి!
అందునెవ్వరో గాక తామాంధ్రులంట!
ఇంక నీభాషయందుఁ గవీంద్రులంట! 337

ఏమిటికి చెప్పుడా! వీరలింత మొఱఁగి
కనఁగ నిర్వ్యయమాకు నొక్కటియటంద్రు?
"మగువ తానేమొ తినునది మగనిసొమ్ము
పాడునది యేమొ యిండెలపాట" గదర! 338

ఎక్కడివారు వీరు? హి!హి!
హీ! గణుతించిన నాంధ్రభాష నా
గ్రక్కిన కూడటంచుఁ ద్విజ
గంబు వచింపగ దానిమెక్కి య
మ్మక్క! మదంబు దేఱి యజ
మానునినే ననుఁ గొట్టువైతు రే
కుక్కకు నున్నదీగుణము?
కొంచెము చెప్పరే! నీతిపారగుల్! 339



సమయ మిదియేయటంచు మౌనములతోడ
వీరలందఱు మనుఁ దిట్టువారె కాని
యిందునొక యయ్యకొడుకున కేనియున్న!
ఘనముగా నాకుఁ జెప్పెడి గ్రంథమొకటి? 340

ఎందఱను జెప్పి యిట్లు నేనేమనందు?
నట్టి హీనులెవ్వైనఁ గాఁ రేలవీరు!
కుక్కలును నాఁడు గర్వంబు గ్రిక్కినంగ
నింకనెవ్వారి మొఱుఁగుల కేమియేడ్వ? 341

చెల్లఁబో! యింక గుంటూరిసీమఁ జదివి
రసము వచియించుచున్నాఁడు "రాయపోలు"
నెందునకుఁ గానిచిత్తయే యిట్లయేని
అడుగవచ్చునె! మాయమాత్యాళి కవిత! 342

ఏను బాపఁపు దైవంబు నేమనందు?
నకట! నాకెట్టి మిత్రంబు నంటఁగట్టెఁ?
బాపికొనుదెట్లు "దేవులపల్లి" నింకఁ!
బోయెనే యింతతోడనె రాయపోలు? 343

అరయ పంతులవారు గద్యమునకెట్లొ
అట్లు చెళపిళ్ళవారు పద్యమునకంట
ఇంతకెవ్వండుఁ దమ్ము గణింపకున్న
వైదికునకైన నిమ్మెయి వ్రాయనౌనె? 344

ఇస్సిరో! యీకుఱుంగంటి యేమిచెప్పె?
నింతపేరాస యుండునే యెందునైన?
పాడు చెళపిళ్లయెక్కడ? పంతులెచట!
నక్కయెక్కడ! వచియింప నాకమెచట? 345

అతఁడు వచనంబు నెంతయు నలరఁజేసి
గద్య తిక్కన బిరుదంబు గాంచుఁగాక!
వెనుకఁ బడెనెప్పుడీ పద్యవిరచనంబు?
చేసినాఁడేమి దానినిఁ జెళ్ళపిళ్ళ? 346

వీని దింతగ నెన్ను కవిత్వమునకు
వానివాచకముల గౌరవంబు గలదె?
చెప్పఁగాక! కుఱుంగంటి గొప్పకొఱకు
తెలియదా విశ్వమింతకుఁ గలనిజంబు! 347

ఇంకఁ బోయిన యుద్ధంబు నేమొ చెప్పి
యొక్కటిగ నుందు రనును నియోగులంద
ఱేకముగనుండి తమ దేమి పీక లేదు
చెప్ప నేటికి? వైదికుల్ గొప్పవారు. 348

అందఱు నియోగు లనియెడి యన్నృతమేల?
పంతు లొక్కఁడు చాలఁడా వైదికులకు?
మంత్రికులమున కేటికి మచ్చఁగూర్పఁ?
దెలుప నింకేల? వచ్చితిఁ దేల్చికొనఁగ! 349

వినుఁడు! వైదికులందఱు వీనులొగ్గి
మీరు నాజాతినే మీఱి నారటంట
ఒప్పికొందును పొందు నేనొకఁడ నోడి
రారె! నామీఁద వైదికులార! నేఁడు. 350

ఇంక నేసభయందు నదేమొ కాని
మీసలకె యుండునఁట ప్రథమాసనంబు
లోకులెంతటి యవివేకులో కదోసి!
యింతమాత్రకు మోసపోయెదరు కాదె? 351

ఏవొ సభలందు నీమీస లిట్లుకాని
నేను భాషకు నభిషిక్తుఁ డైనవాఁడ
నివ్వి నేడుండి రేవుపోయెడివి కాని
భాష యున్నంతవఱకేను బ్రతుకువాఁడ! 352

పెగ్గెలాడంగఁ బెద్దగ బేరుఁ బొంది
యివ్వి ముందేడ్చినంత నాకేమిపోవుఁ?
గ్రింద సింహంబులుండి గర్జించుచుండఁ
గొమ్మపైనెక్కి యిగిలించు కోతులెన్ని? 353

ఇప్పుడీ మీసముల గర్వమెంచి నేను
నన్నయార్యుని నవ్వుకొన్నాను గాక!
ఇంతికే నెంతగౌరవ మిత్తునతని
కెఱుఁగరే దానిమీరు? కవీంద్రులార! 354

పదునైదు పర్వంబు ♦ లెదురులేక రచించి
యతని నామముఁ గొని ♦ యాడినాఁడ
నాతండె మొదలెట్టు ♦ నారణ్యమున వచ్చి
యతని నామముఁ గొని ♦ యాడినాఁడ

ద్వాదశ స్కంధాల ♦ భళిభళీ! యనవ్రాసి
యతని నామముఁ గొని ♦ యాడినాఁడ
నైషధంబును విద్వ ♦ దౌషధం బొనరించి
యతని నామముఁ గొని ♦ యాడినాఁడ
నెన్నియుని చెప్పు? నిల్ల వేయింటిఁ వ్రాసి
యతని నామంబునే కొని యాడినాఁడ
నట్టివానిని నేఁడిట్టు లవహసింప
నెవరు బాధ్యులో? చెపుఁడు! బుధేంద్రులార! 355

ఎందునకుఁ గాని నైదికుల్ కొందఱిప్పు
డేను మొనగాండ్రమని గర్వ మెఱ్చుచుంట
నాకు నేనయి నవ్వుకొన్నాను గాక!
యేమి! నన్నయ నిజమున నింతకాఁడె? 356

ఇంతటను బోయితే? యింక నిలనుగలుగు
నైదికుల నందఱిని పప్పువంట కిత్తు
వారి మీసలగర్వంబె బట్టిగాక
కలదె! నాకెందు కులభేదముల దుహూహ? 357

ఒక్కని గుఱించి యందున కున్న జాతి
సంతటిని నవ్వ నిదితప్పియనుఁడు నాది
మొదట వారట్లు తమమీసములకుఁ జెప్ప
నందు నెందఱు వారిఁగాదనిరి? చెపుడ! 358

అట్లు కాదనకుండుట లటుల నుండ
వారిపక్షంబుఁ బూని కొంగ్రంపుకవుల
నింక నెందఱు వచ్చిన నెల్లఁ బ్రేల
రెందుకొఱ కిద్ది? చెపుడు! కవీంద్రులార! 359

ఏను మావారితోడ నిట్లెగు డెంచి
తమను గాఱించుటలు కులతత్త్వమంట
అయినఁ గొంగ్రంపు కవుల నట్లందఱొకటఁ
దాము గాఱించుటంగల తత్త్వమేమి? 360

అంతగానుండు తమతత్త్వ మరయకుండ
నహాహా! నాయదె కులతత్త్వ మనఁగనొప్పె?
మగువ యొక్కతె వెనుకట మగనిఁగొట్టి
బేలవలెఁ దానె మఱిమొఱఁ బెట్టినట్లు 361

ఇంతజేసియు వీర లేమెఱుఁగ రనఁగ
వైదికులు నీనియోగు లెవ్వారలంద్రు?
భేదమిర్వుర కేన గల్పించి నట్లు
ఉన్న తప్పంతయును నాదెయన్న యట్లు. 362

ఉర్వి నీవైదికులును నియోగు లిర్వు
రాడి కొనరింత కింకెంత యధికముగను?
వారిజోలికిఁ బోయె నెవ్వండు? చెపుడ!
ఎంచిరా నింత నేనిట్లు మిన్నకుండు? 363

ఏదో యిర్వురు శమలోన నేమ్చుచుండ
నోరుగఁ బడనో నె? గుంపంత యొకనిమీఁద
బాపురే! మీనముల కంత బలగమున్న
లేడ? వారికి నాయట్టి వాఁడొకండు? 364

ఇంక నామీఁద వచ్చువారెవరో వారి
సమగుచున్నాడ! వినరె! యీయాంధ్రమందు
నీ యమాత్యుని మించి మీరేమి వ్రాతు
రద్ది మునుజెప్పి మఱికాఱు లాడరండు. 365

కనఁగ నయ్యాది మొనగాని తనముగాక!
వాఁడె యొకనికిఁ బుట్టినవాఁడు గాక!
వెధవలం బోలె యూరకఁ బ్రేలనేమి?
అంతకే మీరు దొడ్డవారగుదు రొక్కొ! 366

తెలియుఁ డాతిట్లయందేను దీసిపోవ
నమ్మనాలిని మొదలెట్టి యాలపింతు
నీళ్లు నిప్పులులేక నా నిలిచినట్టి
ప్రాణములు పోవువఱకు, జాగ్రత్త మనుఁడు! 367

అందు నాగక నింక హీనాత్ములగుచు
పశుబలంబును జూపింప వలవదేల?
కనుఁడు! వెనువెంట ఖడ్గమందునకె కలదు
వెనుకఁ బడదిద్ది! నాకలంబునకె యుద్ది! 368

ఇంత కెన్నో రణంబుల నెసఁగి యొసఁగి
వచ్చి నెత్తురులం దోఁపి బ్రతుకుచుండు
నేమి చెప్పను? నేఁడు గాంధీమహర్షి
నలుపఁ గావేసికొనె నహింసా వ్రతంబు. 369

ఆతనికి నా యొసంగిన యభయ మెంచి
యిద్ది యుపవాసములఁ గృశియించుఁ గాక!
అప్పటికి దీని నడుపుట కొప్ప దేని
జాలునే బుక్కెడైన ముజ్జగము లొకట. 370

పడ్వఁ బోకుండు నినుశపియింతు మనుచు
మీ యుపాసించు దేవత మాయ యెంత?
సకల భువనంబు లేను భస్మంబు జేతు
సాటి లేనట్టి వైష్ణవ శక్తి నాది. 371

అహహా! యన్నింట నిట్లు సన్నధికుఁ జేసి
యిలకుఁ బంచిన భగవంతు నెంతఁ బొగడు
దేను మరణింప ఘటికగా నేని మొలచి
పాడుకొను వాఁడ పోయి నాభద్రకీర్తి. 372

ఏను నాలోనఁ బూర్వ కవీంద్రకోటి
నరయుచున్నాఁడఁ గనుమూసి యహరహంబు
నన్నయను గూడి వారలు నాశిరానఁ
గురియు చున్నార లల్లదే కుసుమవృష్టి! 373

నేనువచ్చిన పనియైన దింక నేఁగు
దీశరీరంబు నిల భస్మరాశి జేసి
ఎవ్వ రింతయు నాకోస మేడ్వవలవ
దరసి కొనవచ్చు నాభావ మాంధ్రభాష. 374

బ్రతుకు దింతకుఁ గొ్రంపువారి కొఱకు
నాదుప్రేమయె లోలోన నన్నుఁ దినఁగ
నీద్వ తేనింక నిట్లు నీయెడఁద నేను;
బాధపడఁ జాలనింక నీవ్యాధి నేను! 375

ఇంత నాయంతే వాఁడొక యింతిఁ జేసి
దీనుఁడయ్యెనె? నిఱుపేద వానినించి
అక్కటా! నాకు దీని నేపునఁగవచ్చు?
వాఁడుదానికి నింత మహత్త్వమేమి? 376

ఎవతెనో చూచుమాత్రనే నిట్లయెంచి
యూహ యీనన్నుఁ బ్రేమింప దనుటగాదె?
మాటలోమాట మనసులో మనసుఁ గలిపి
చివర కీతీరు నన్ను వంచింపనేల? 377

# అపూర్వ కవి సమ్మేళనము.

ఎవరో పేరూరులేని వారింత పొగడఁ
ద్రుళ్ళి పడనేల నీకునో చెళ్లపిళ్ళ?
ఎవరో వీరలు "నెల్లుట్ల" నేమటంద్రో
చెవిని బెట్టుము కన్నులు చెమ్మగిల్ల!

మొల్ల.

"ఓయి నను గన్నతండ్రీ! గర్వోద్ధతులను
నణఁగఁ ద్రొక్కెడి నీదు భావార్ణవమున
భావనయి నాకు నీనేన పాడికొనుచు
నూగెద తరంగమున కొక్క యుయెలగట్టి."

భారతి.

ఆంధ్రభాష సమాత్యుల యాజ్ఞమీఱ
బ్రహ్మదేవున కైనఁ దరంబుకాదు
వినయవంతులు నీతి కోవిదులు వారు
కాలరుదుగిలు మఱి మహాకవులు వారు."

నన్నయ.

"నన్నపార్యుఁడు వచియింప నన్నువినియుఁ
గొనదు నానామ మేడ నీగ్రుడ్డిలోక
మీవు లేకున్న నాబ్రతు కేమిగాను?
ఉద్ధరించితే! వెయ్యేండ్ల కుద్భవించి."

నారాయణుఁడు.

"ఏమి మొనగాండ్రమని కొంద ఱేమొ పెంచి
మూఢ లోకంబునను బేరు మోయనిమ్ము!
హే యమాత్య! నీవేల కన్నెఱ్ఱజేసి
తద్ది పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రము గద!" తిక్కన.

"కంటె! శ్రీరాముఁడును దొల్లి కాకిమీఁద
నాగ్రహము బూని వేసె బ్రహ్మాస్త్ర మయిన
నుభయ కవిమిత్ర! దానికీ యుదుకు లేదు
పిల్లకవి యీఁత డింత 'యావేశ మేమి?" ఎఱ్ఱన.

ఏమమాత్యుల మించు మీ రెఱిఁగి యెఱిఁగి
వింత పడనేటి కితని యావేశమునకు?
నితఁడు మీవంశమున జనియించి గాక!
యింత యావేశ మెవఁడూను? నెఱ్ఱనార్య! సంకుసాల—

బాలుఁడ వీవు తల్లి చనుబాలను గ్రోలిన తీపియింక నీ
నాలుకఁ బాయలేదు కదనంబున గాకలు దీఱినట్టి మీ
సాల మొగాలువారు రభసం బలరార నెదిర్చి పంచబం
గాళ మొనర్చితౌర! కవిగా! నినుగాంచిన భీతికల్గెడిన్.
నాచన సోముఁడు.

ఒక తరంగంబునకె పెద్ద లొక్కరొకరు
తట్టుకొనలేక నిట్టట్టు తల్లడింత్రు
చాలునో తండ్రి! నామాట శాంతిజెంది
హాయి కనుమూయు మాంధ్ర భాషార్ణవమున. పోతన.

ఏ యనామకునో పెద్ద మెలుఁగుబెట్టి
ఆంధ్ర భాషను నీవేలుమనఁగ నేమి?
మంత్రుల మహత్త్వ మొకమాటు మఱలవినిచి
యందునకు నిన్నుఁ జెప్ప భావ్యంబుగాక! కంకంటి —

ఆంధ్ర వాఙ్మయవీర! యయ్యావసి నెపుడు
భారతీదేవి నినుఁ బోలువాని నోచి
దుర్మదాంధుల యెట్టి దుందుడుకు లేక
నిల్చి ముదమునఁ దేలిపోయెడిని గాక. ధూర్జటి.

ధర్మ మార్గంబును ♦ దవిలిసత్యము నెప్పు
డూది చెప్పెడినంట ♦ నీదు కవిత
శూద్రుఁడైనను వాఁడు ♦ సుకవిత్త్వమును వ్రాయ
మాయురే! యనునంట ♦ నీయెడంద
అర్థించు వారల ♦ హర్షితులం జేయ
నిలచి యుండెడినంట ♦ నీధనంబు
గర్వంబు గ్రక్కు కాశవుల ♦ భూమికిఁద్రొక్కి
నిక్కి చూచెడినంట ♦ నీకలంబు
ఆంధ్రభారతి ప్రతినిధివై వెలుంగ
మహిని నీకన్న నేఁడు సమర్థుఁ డెవఁడు?
మంత్రి బిరుదాంక! ఆంధ్రవాఙ్మయము నింక
ముందు నడిపింపు దిగ్దేశములునుతింప.

భట్టుమూర్తి.

ఈ క్షోణిన్నినుఁ బోలు దిగ్గజములేరీ నేఁటికాలంబునన్?
దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయప్రౌఢ సాహిత్యముల్.

(శ్రీ)నాథుఁడు.

హితుఁడవు చతుర వచోనిధి
వతుల పురాణాగమేతి హాసకథార్థ
స్మృతి యుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్? అల్లసాని.

ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునున్ జుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ? సరసార్థబోధఘటనా హేలాపరిష్కార శా
రద నీరూపము రామకృష్ణ కవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!

తెనాలి:—

ఇట్లుగా నన్ను మీరు వచించుడయిన
జూడలేకుండి కొంద అసూయఁ గొందు
రన్యుఁ డని నేను? నన్నుఁ గొండాడుటనిన
ననఘులీ మీరు మిముఁ జెప్పికొనుట గాదె? నెల్లుట్ల-

నన్నుతిఁ గన్న నాంధ్రమున జాల్మ లనేకులు ధర్మమార్గ నం
పన్నుల కెగ్గుగూర్చుటలఁ బట్టక వారల నీవడంచుచోఁ

గన్నులఁ గట్టు మాకుఁ గలికావరముఙ విదళించు నా పరీ
క్షిన్నరపాలుఁడో సచివశేఖర! నీకివె ధన్యవాదముల్.

భాస్కరాదులు.

ఒక్కొక చిన్నిగీతమున నున్న మహోన్నత భావశక్తికే
మొక్కఁగనౌను నీ కవనముఙ బఠియించుచు నాత్మవిస్మృతిఙ
జిక్కుదు మెంతయేనిది విచిత్రము పొందితి యేమిలేని నీ
వాక్కుల కింతశక్తి యెటువచ్చినదయ్యా! యమాత్యధీమణీ!

గంగన సింగనాదులు.

సమ్మతి యావదాంధ్రమును సాఁగిలి త్రావక సాహితీప్రచా
రమ్మున కంజలించుఁ గవిరాణ్మణి! యన్మదమాత్య ధర్మశీ
లమ్ములఁ గుప్పవోసితి విలక్షణహేతు విషాదభావ భా
రమ్మగు నీదు కావ్యసమర మ్మమరంబగు గెల్పునందగఙ.

అభినవ నన్నయ, దేవులపల్లి వేంకటేశ్వరరావు.

ఏను రామాయణము వ్రాసినాననంగ
నమ్మననుఁ జెల్లపిళ నేమనంగవచ్చు?
నొసఁగి తేమన్న నీవు ప్రత్యుత్తరంబు?
లేదె? యభిమానమేను జెల్లెలినిగాదె! మొల్ల.

కటకటా! యన్నమాట కాగ్రహము వచ్చి
యేమిచెప్పితి మా మొల్ల నెటేఁగి యెటేఁగి?
నీవు నీనోట నన్ను మన్నించితనవె!
ఏమిసేయుదు? జాఱిపోయినది మాట. నెల్లుట్లః-

"ఈ కవిమహత్త్వము జెప్పవలెనన్న నీతఁడే ప్రాచీనయధునాతనులకు మధ్యవర్తి కాఁదగిన సాహిత్యవేత్త అనఁదగినవాఁడు"
గోలకొండ.

"గీతపద్యం నడిపించుటములో కవిగారి నేర్పు సొంపులు దీరింది." ప్రజామిత్ర.

"ధారాశుద్ధి గల కవిత్త్వం." ఆంధ్ర పత్రిక.

"భారతీ కృష్ణాపత్రికలు మాటాడ వెందులకు? జక్కన.

"వాని కమాత్యుఁడనిన యసూయ." ముక్కు తిమ్మన.

"ఎందులకు?". పింగళి:-

"ఇవి చెళ్ళపిళ్ళ అండ్ కో కు సంబంధించినవి." మొల్ల.

"అయిన నమాత్యుని ద్వేషింపవచ్చును గదా."
అనంతామాత్యుఁడు.

"అట్లు బహిరంగముగ ద్వేషించిన లోకము సహింపదు. అందుకనే యీ మౌనము." ధరణీదేవుల.

"దయజేసి భారతీ పత్రిక నాపేరు మార్చికొను గాక!"
భారతి.

"ఎందులకు? అవి నేఁడు క్షీణదశకే వచ్చినవి." మడికి-

"సంతోషము." కూచిమంచి:-

"నా చచ్చిన వెనుక భారతీ పత్రిక యింత నిర్జీవమయి పోవునని నేననుకోలేదు." విశ్వదాత-

"ఒక భారతి ఆంధ్రపత్రికలే కాదు. భాషాస్వరూపులైన మంత్రికులజుల లక్షింపనివారల యందఱు బ్రతుకు లింతియ."

చింతలపూడి.-

ఆంధ్ర దేశంబునకు మఱి యాంధ్రభాష
కీవు పెట్టని కోటగ నెసఁగుచుందు
వేమికలదయ్య! యాంధ్రుల కీవులేక?
నిన్ను నిరసించువారి మన్నింతు రెవరు? ఆంధ్రులు.

దేశ భాషలయందుఁ దెనుఁగు లెస్స
యనుట నొప్పె నియోగి బ్రాహ్మణులవలన
నెప్పుడుఁ గృతఘ్నులకుఁ బురోవృద్ధిలేదు
వారి భావింతు భాషకు బలుపుగోరి. వేదము-

చాలును బలేయెఱింగితి సత్యమొకఁడ
వేమిచెప్పితి? విట్లు యింకెప్పుడనకు
మాంధ్రి యట్లొప్పియుండుట నరయునపుడు
చెళ్ళపిళ్ళ మహాకవిఁ జెప్పుదేము. పింగలి & కాటూరి

నిజము కవులార! మీమాట నిజమునిజము
మీ రమాత్యులు మీసల మేటిశిష్యు
లింక మిమ్ములఁ గాదన నెవరితరము!
సిగ్గునకు సిగ్గులేకుంట చెప్పనేమి? మొల్ల.

ఈయ దేనాఁటి సంబంధమో యెఱుంగ
మెంతజేసితి మాకోస మీ వమాత్య!

నిర్భరానంద మందు మునింగినాము
తెలుపవే! నీ ఋణం బెట్లు దీర్తు మేము?

మా నయనుం దలంచియుసుమా! కవిరామ! సతీలలామ ల
క్ష్మీనరసాంబ జచ్చుటయు మీ జనకుండు మహామహుండు రా
మానుజదేవిఁ బెండ్లియయి యాయమయందున నిన్నుఁ గాంచుడ
ట్లైనను వేంకటేశ్వర మహాత్ముఁడు పూజ్యుఁడు మాకు నెప్పుడుఁ

కొప్రపు కవులు.

తమను దలఁదన్ను నాకవిత్వంబు జూచి
వైదికులు నా కులమ్మును వదరునాఁడు
"వీఁడు మావాఁడె" యని గౌరవించితెవని?
వాఁడు దలపోయ నేఁడు నీవాఁడుకాదె? చేమకూర-
ఇటు కనుంగొను మోయి! వేంకట కవీంద్ర!
ఇంత నీవలె కెవరు రానిచ్చువారు?
మొల్ల మొగమున కెన్నాళ్లు ముండముసుఁగు?
చాలనే నేను వైదిక జాతికంత? మొల్ల.
భళిర! మా మొల్ల కెంతటి పౌరుషంబు?
ఉండునే యీమె కింతటి గుండెదిటవు?
చెళ్లపిళ్ల సంభవం బెంత జేసెనకట?
నన్నయార్యుఁడు ఖిన్నుఁడై నాఁడు మొల్ల! ముద్దు-
అరరె! ఆఁడుది, యందుఁ గుమ్మరిదికంటె!
చాలునే తాను వైదిక జాతికంత?

యున్నిరో! దీని నేను సహింపఁ జాలఁ
బూడ్చెదనుగాక మొల్లను భూమినిపుడ! నన్నయ.

ఆగు మాగుము! నీవేడి కేఁగుదనఘ!
నేను గలుగంగ నా మొల్ల నేమిసేతు?
మాకుఁ గలశక్తి యొక కమ్మమాపు నేని
జాలదే మొల్ల వైదికజాతి నార్ప? నెల్లూట్ల:-

నేను నన్నయ నొక పిల్లవాని కోడి
తలను వంచితినే యాఁడుదానిముందు?
వినని కనరాని వీని కవిత్వశక్తి
యుర్వి నేమంతి) కింక లేకుండుఁగాక! నన్నయ.

ఇట్ల మంతు)ల నీవు శపింతువేని
శబ్దశాసన! వినుము నా శాపమేమొ!
కలుగక నె యుండుగాత! నీ తెలుఁగునందు
నవని నెన్నఁడు మముమించు కవియొకండు. నెల్లూట్ల:-

ఇద్దఱును నాకుఁ బిత్రుసములే తలంప
నొకరి నానని కాదన నొకరినేను
శాపముల రెంటికిని గొంగుఁ జాపికొంటి
నలుకఁ బాయంగ నొనింక ననఘులార! భారతి.

ఇప్పటికి శిష్యసంఘంబు నెచ్చరించి
చేయరా దేల యుద్ధంబు జెళ్ళపిళ్ళ?

వలదనఁడు మా యమాత్యుండు వలదనంచు
కలము తనదియు నడిపించుఁ గనుఁగొనుండు. మొల్ల

చెప్ప నింకేల? యుద్ధమే సిద్ధమేని
నాలకింపుడు నామాట నాంధ్రులార!
ఏనె "నెల్లుట్ల" యనఁగ నింకేవఁడో కాదు
వాని తలవంపు నా తలవంపు వినుఁడు!

కనరె! ముందట నేనెట్లు కత్తిఁగొని
యనికి నంపితినో వాని నక్కటకట!
దీనుఁడై వాఁడు నన్నింత దిట్టుఁడైనఁ
గాలఁ దన్నఁగరాదె! లక్కాంబ కడుపు? పోతన.

ఇంత యేటికి పోతన కితని మీఁద?
భారతియు బెట్టికొనెడిఁ గన్నీరు నకట!
ఇది వినోదముగాఁ జూచెదే? యమాత్య!
ఒసఁగ వేమిటి కింకఁ బ్రత్యుత్తరమ్ము? నన్నయ.

కాటుక కంటినీ రిటులఁ గాలువఁ గట్టఁగ నేలయేడ్చెదో
కైటభ దైత్యమర్దనుని గాదిలి కోడల! యో మదంబ! యో
హాటక గర్భురాణి! విను మాహవమే యిఁక వచ్చుఁగాక! నీ
కోటమిఁ దేను ప్రాణముల నొడ్డి వచించెద నమ్ము భారతీ!

పోతనా! నీకు నిట్లాడఁ బోలదెప్పు
డేను నీమాట లింత సహింపఁజాల

నవ్వుడే మంచికొనిపోమె సంతమేమి?
యెట్ల యెంచితి వీవు “నెల్లుట్ల” యనఁగ?
పేరుకొన నేల పెద్దగ వీరి వారి
రాని తిక్కన యింక వైరంబుబూని
ఒక్క గుటుకను మ్రింగు దోవలోయనంగ
విస్మరించితివే! నా కవిత్వశక్తి?
ఇతర మంత్రులనే శపియించెఁ గాని
నన్నుఁ దిట్టఁడు నన్నయ వున్నమేమొ!
ఒక్కఁడనె గాని నేనింత కున్నవాఁడ!
శత్రుకోటిని బరిమార్పఁ జాలువాఁడ!

ఏను వైరుల కోడిపోయితినె యనుము!
తెలుపుమా యందు నీవేల తలనువంప?
నవ్విపోవరె యిదివిన్న నవ్వ రేని?
నింత యభిమాన మేల నీకేననంగ?

వలదు పోతన! ననుఁ జేరవలదు వలవ
దీవెవండవు నాకు? నీకే నెవండఁ?
గాలి యెచ్చోట మన్ననఁ గలసినావొ!
ఏను నెక్కడ గలసిపోయెదనొ యెల్లి!

నెల్లుట్ల.-

